# చిత్రకవిత్వ పరిశీలన - అవగాహన

## చిత్రకవిత్వ పరిశీలన - అవగాహన

### చిత్రకవిత్వం - శబ్దచిత్రం

సాహితీమిత్రులారా!

చిత్రకవిత్వం అనేకులు అనేక విభాగాలుగా వివరించారు.

కొందరు 1. శబ్దచిత్రం 2. అర్థచిత్రం 3. ఉభయచిత్రం అని విభజించారు.

మరికొందరు శబ్దచిత్రం, గతిచిత్రం, గూఢచిత్రం, కూటచిత్రం, గర్భచిత్రం, ఆకారచిత్రం (బంధకవిత) ఇలా అనేక విభాగాలుగా విభజించారు.

శబ్దచిత్రం :-

దీనిలో అనేక రకాలు ప్రస్తుతం ఏకాక్షర శ్లోకం ఒకదాన్ని గమనిద్దాం.

ఏకాక్షర శ్లోకం

మామామమామమమేమామా మామూమామేమమేమమే
మామామేమిమిమేమా మమమోమామామమామమీ

ఇందులో వ్యంజనం(హల్లు) ఒకటే ఉంటుంది కాని అచ్చులు ఏవైనా ఆ వ్యంజనం కూడి వస్తుంటాయి.

ఇది ఏకాక్షరగా "మ" అనే ఒక వ్యంజనం కలిగి ఉన్నందున ఏకవ్యంజనముగా పిలుస్తారు.

శ్లోకం అర్థం

మమ = నాయొక్క, మా = బుద్ధి, ఇమాం మామ్ = ఈ లక్ష్మిని, ఆమ = పొందెను, అమేం - అమా = సహితురాలైన,

ఈ = లక్ష్మిగల, అమ్ = నీ పాదమును, ఆమామూమ = ఆశ్రయించితిమి, అమే = ఓ దుర్బుద్ధీ జ్యేష్ఠాదేవీ, మే = నాకు, అమ = దూరంగా వెళ్లుము, అమామ్ = లక్ష్మి కంటె వేరైన దేవతను, మా , ఏమి =పొందను, అమ: = బంధరహితుడనై, మామం - మా = లక్ష్మి యొక్క, అమమ్ = ప్రాపును, మిమే = అపేక్షింతును, అమీ = ఈ మేము, మామ్ = ప్రమాణమైన శాస్త్రమును, మా అమామ = అతిక్రమింపము-

ఇక్కడ మరొక ఏకాక్షరి యమకరత్నాకరంలోనిది చూడండి.

యాయాయాయాయాయా
యాయాయాయాయయాయయాయాయా:
యాయాయాయాయాయా
యాయాయాయాయయాయయాయాయా: (12 - 54)

(ఓ జగదీశుడా! సకలైశ్వర్యసంపన్నుడా! లక్ష్మీసహచరుడా!
స్థావరజంగములయొక్క సమృద్ధికిని,
బ్రహ్మాదులయొక్క ఉత్పత్తిసంపత్యాదులకును,
కారణభూతురాలైన లక్ష్మీదేవితోగూడ
నీవు నా ముందరకు వచ్చి సేవప్రసాదిచవలెను.)

## తెలుగులో ఏకాక్షరి

సంస్కృతంలో వేంకటాధ్వరి రాసిన లక్ష్మీసహస్రం తెలుగులో వేదుల సత్యనారాయణ రాశారు దానిలోనిది ఈ పద్యం.

ద్విపద: రరరారరారోర రరరేరరైర
రరరారరేరరోరారరారార

(లక్ష్మీసహస్రం - చిత్రస్తబకం - 35.)

ఇందులో ర- అనే వ్యంజనం(హల్లు) ఒకటే వాడబడినది.

అర్థం:- ర = వజ్రాయుధంను, ర = గ్రహించు ఇంద్రునకు, రా = ధనంను, ర = ఇచ్చుదానా, (దుర్వాసశాపగ్రస్తుడైన ఇంద్రునకు తిరిగి రాజ్యం ఇచ్చినదానా అనుట), రా = రమ్ము, రో = ర + ఉ - ర = అగ్ని, ఉ = శివుడు, రర = వజ్రాయుధ హస్తుడగు ఇంద్రుడు వీరందరిని, ర = గ్రహింప చేయునట్టి, రా + ఇల = ధనమునకు భూమి అయినదానా, రై = ధనమును, ర: = గ్రహింపచేయుదానా, ర = నాశమును, ర = పొందునట్టి వారిని, రా = స్వీకరించుదానవును, అర = ధనహీనునకు, రా = ధనమునకు, రో = ఇలలో స్థానమైనదానా, రో = ర +అ , ర = కోరికతో,అ = విష్ణువును, ర = స్వీకరించువారికి, రా = ధనమును, ర = గ్రహింపచేయువారియందు, అ = సంపూర్ణమైన, ర = కోరికగలదానా!

ఈ కింది కందపద్యం విక్రాల శేషాచార్యుల శ్రీవేంకటేశ చిత్రరత్నాకరం పూర్వభాగంలోనిది.

కం. నిన్ను నిను నెన్న నీనే
నెన్నిన నన్నన్న నననినిన నానే నా
నిన్నూని నా ననూనున్
నన్నూనన్నాను నేననా నున్నా నా

అర్థం:-
అనిన = నీకుపైన ప్రభువులులేని, నానా = సర్వమునకు, ఇనా = ప్రభువైనవాడా, ఇనున్ = సర్వేశ్వరుడవైన, నిన్నున్, ఎన్నన్ = స్తుతించుటకొరకు, ఈనేను, ఎన్నినన్ = ఆలోచించినచో, నను = చిగురును, (అల్పుడని అర్థం), అన్నన్న = చోద్యం, అనూనున్ = గొప్పవాడవైన, నినున్ = నిన్ను, ఊనినాను = ఆశ్రయించినాను, నున్న = త్రోసివేయబడిన, అనా = శకటముగలవాడవైన, అనా = తండ్రీ, నేను, నన్ను+ ఊను = ఆదుకొనుము, అన్నాను = అంటిని.

### ఇతర భాషల్లో ఏకాక్షరి

కన్నడ భాషలో 12వ శతాబ్దికి చెందిన నాగవర్మ "కావ్యావలోకనం"లోని ఏకాక్షరి ఉదాహరణ.

ಶ್ಲೋ. ನಿನ್ನಿ ನೇನಿನ್ನ ನಾನನ್ನ |
ನಿನ್ನ ನೆನ್ನ ನನೂನನಂ||

నున్న న్నైనన్న న్నైనేనే।
నేనిన్నన్నం నిన్నే నానునం॥

(కావ్యావలోకనం - 8 - 584)

పై కన్నడ శ్లోకానికి తెలుగులిపి

శ్లో. నిన్న నీనిన్న నానన్న
నిన్ననెన్న ననూననం
నున్న న్నైనన్న న్నైనేనే
నెన్నిన్నం నిన్నె నానునం

హిందీలో లేఖరాజకవి రచిత "గంగాభరణ్ "లోని ఏకాక్షరి.

गंगी गोगो गो गगे, गुंगी गो गो गुंग ।
गंगा गंगे गंग गा, गंगा गंगे गंग ।।

పై దోహకు తెలుగులిపి

గంగీ గోగో గోగ గే, గుంగీ గోగో గుంగ
గంగా గంగే గంగ గా, గంగా గంగే గంగ

## ఏకాక్షర పాదం

ఒక పాదానికి ఒక హల్లు మాత్రమే ఉపయోగిస్తూ నాలుగుపాదాలకు నాలుగు వేరువేరు హల్లులను వాడటాన్ని ఏకాక్షర పాదం లేక ఏకవ్యంజనపాదం అంటారు.
భారవి కిరాతార్జునీయంలో రాసిన ఏకాక్షరపాద శ్లోకం గమనిద్దాం.

శ్లో. స సాసి: సాసుసూ: సాసో
యేయాయేయాయయాయయ:
లలౌలీలాం లలో2లోల:
శశీశశిశుశీ: శశన్

**(కిరాతార్జునీయమ్ -15-5)**

అర్థం **:-** సాసి: = ఖడ్గంతో ఉన్న, సాసుసూ: = ప్రాణాలను హరించే బాణాలు ధరించినవాడు,సాస: = ధనువును ధరించినవాడు, యేయ + అయేయ + అయయ + అయయ - వాహనంతోను, వాహనంలేకుండా శత్రువుని చేరి వారి వాహనాలను స్వాధీనం చేసుకున్నవాడు, లల: = అందమైనవాడు, అలోల: = చాపల్యంలేనివాడు, శశి +ఈశ + శశు + శీ: - ఈశ్వరుని కుమారుడైన కుమారస్వామిని పరుగెత్తింపచేసే, స: = అర్జునుడు, లీలాం = శోభను, లలౌ = పొందాడు.

## ద్వ్యక్షరి

రెండు హల్లులను(వ్యంజనాలను) ఉపయోగించి
కూర్చిన శ్లోకం లేదా పద్యాన్ని "ద్వ్యక్షరి" అంటారు.
ఇందులో అచ్చులు ఏవైనా ఎన్నయినా ఉండవచ్చు.

ఆయలూరి కందాళయార్య విరచిత అలంకారశిరోమణి(7-19)లోని ద్వ్యక్షరి. ఇది గ,ర - అనే రెండు వ్యంజనములచే కూర్చబడినది.

గౌరగూగ్రాగగోగాగగోగోరు గురుగేగురుః
రంగాగారేగారిగంగాగురూరాగిరిరుగ్గిరా

(అలంకారశిరోభూశణే శబ్దాలంకారప్రకరణం - 19)

(ధవళకిరణాలు గల చంద్రునీ,
శివునికొండ అయిన కైలాసాన్నీ,
స్వర్గమందున్న కల్పవృక్షాన్నీ,
కామధేనువును వజ్రాయుధాన్ని పోలిన
తెల్లని కాంతిగల శేషునిశయ్యగా కలిగిన గొప్పవాడు,
గంగాజనకుడు అయిన శ్రీమహావిష్ణువు
వేదవాక్కులచే శ్రీరంగభాగ్య సంపదగా ప్రకటించబడినాడు.)

ఈ శ్లోకంలో గ - కారం, ర - కారంలు మాత్రమే
ఉపయోగించబడి శ్లోకం కూర్చబడినది.
కావున ఇది ద్వ్యక్షరి.

సూరిః సురాసురాసారిసారః సారససారసాః
ససార సరసీః సీరీ ససూరూః స సురారసీ

(కావ్యాదర్శము-3-94)

(పండితుడును దేవతల విషయమునను అసురుల
విషయమునను ప్రసరించు బలము కలవాడును,
మద్యమునందు ఆసక్తి కలవాడును అగు
బలరాముడు అందమైన ఊరువులు గల ప్రియురాలుతో
కూడినవాడై, ధ్వనితో కూడిన (ధ్వని చేయుచున్న)
సారసపక్షులు గల సరస్సులను సంచరించెను.)

దీనిలో స, ర - అనే రెండు వ్యంజనములు(హల్లులు)
మాత్రమే ఉపయోగించబడినది.
రెండు వ్యంజనాలతో కూర్చిన దాన్ని ద్వ్యక్షరి అంటారు.

తెలుగులో నందితిమ్మన పారిజాతాపహరణం(5-98)లోని పద్యం ఇది. ఇందులో "న, మ" - అనే రెండు వ్యంజనాలను ఉపయోగించి కూర్చడం జరిగింది.

మనమున ననుమానము నూ
నను నీనామ మనుమను మనననమును నేను
మ్మున మాన నన్ను మన్నన
మనుమను నానా మునీన మానా నూనా

నానా = సకల, మునీన = మునిశ్రేష్ఠుల యొక్క, మాన = ప్రమాణములకు, అనూనా = అధికుడా, మనమునన్ = మనస్సునందు, అనుమానమున్ = సందేహమును, ఊనను = పెట్టుకొనను, నీనామమును = నీ పేరను, మను = మంత్రం యొక్క, మననమును = ధ్యానమును, నేమమ్మునన్ = నియమముతో, మాననన్ = వదలను, నన్నున్ = అటువంటి ఏకాంత భక్తుడనగునన్ను, మన్నన్ = ప్రీతితో, మనుము+ అను = జీవించుము అని చెప్పు.

## త్ర్యక్షరి

కేవలం మూడు హల్లులతో పద్యాన్ని లేదా శ్లోకాన్ని
కూర్చిన దాన్ని "త్ర్యక్షరి" అంటారు.
అది కందం అయితే "త్ర్యక్షరకందం" అంటారు.
ఈ పద్యం(శ్రీ .శ్రీ. ) సిప్రాలిలో సిరిసిరిమువ్వ -16లోనిది.

మనసాని నిసిన సీమా
మనసా మసిమనిసి మనసు మాసిన సీనా
సినిమానస మాసనమా
సినిమానిసి సీమసాని (సిరిసిరిమువ్వా!)

దీనిలో సిరిసిరిమువ్వా అనేది మకుటం దాన్ని వదలితే
మిగిలిన వాటిలో మ,న,స - అనే హల్లులు వాడి పద్యాన్ని
కూర్చడం జరిగింది.
దీనిలో 8 పదాలు ఉన్నాయి.
1.మనసు,2. సాని, 3. నిసి, 4. సీమ,
5. మసి, 6. సీను, 7. సినిమా, 8. ఆసనము.

## చతురక్షరి

భవభోమ మమా భామా భూమి వామా విభోభువి
భీమభీవైభవావాపీ పావభూమ భవాంబు పా:

(అలంకారశిరోభూషణే శబ్దాలంకారప్రకరణం-22)

(శ్రీదేవీ భూదేవి విభుడవైన ఓ రంగనాథా!
భువిలో మాకు భవభయాపహరుడవు కమ్ము.)

ఈ శ్లోకంలో ప,భ, మ, వ అనే నాలుగు హల్లులే
తీసుకొని వ్రాయడం వల్ల దీన్ని "చతురక్షరి" అనికూడ అంటారు.

## తలకట్ల కందం

ఒక పద్యంలో కేవలం తలకట్లనే ఉపయోగించి కూర్చిన దాన్ని తలకట్ల పద్యం అంటారు.
అది కందపద్యం అయితే తలకట్లకందం అంటాము. ఇది కేవలం తెలుగులో మాత్రమే కలదు.
అంటే కేవలం "అ" - స్వరాన్ని ఉపయోగించి పద్యాన్ని కూర్చటం.
దీనికి ఉదాహరణగా పోకూరి కాశీపతిగారి
"సారంగధరీయం"(త్ర్యర్థి కావ్యం)లోనిది.

గజచర్మ వసన కనదం
గజమదహర యచలసదన గరళగళ లస
ద్గజవదనజనక యస్మ
ద్భజనం బరయం గదయ్య భయమడఁప దయన్ (2-125)

(ఏనుగు తోలును ధరించినవాడా! ప్రకాశమానమైన మన్మథుని
గర్వమును హరించినవాడా! పర్వతనిలయుడా!
విషమును కంఠమునందుగలవాడా!
మనోజ్ఞమైన వినాయకునికి తండ్రివైనవాడా!
ప్రేమతో నాభయం తగ్గేందుకు
నాసేవను ఓ అయ్యా చూడగదవే.)
ఈ పద్యంలో దేనికి కూడా తలకట్టు తప్ప
వేరే గుణితము లేదుకదా!
కావున
ఇది తలకట్లకందం.

## గుడుల పద్యం

అచ్చులలో "ఇ"- మాత్రమే ఉపయోగిస్తూ రాయబడిన శ్లోకం ఇది.
ఇదే పద్యం అయితే గుడుల పద్యం అంటాము.
ఇందులో "ఇ" - అనే ఒకేఒకస్వరం ఉపయోగించడం వలన
ఇది ఏకస్వరనియమం క్రిందికి వస్తుంది.
ఇక్కడ శ్లోకం మాత్రమే చూద్దాం.

గిరిభిద్విట్చి దక్లిష్టిక్షితి శ్రితి సితి త్విషి
స్విష్టి సిద్ధిర్న్రిర్విచ్చి త్తిస్థితిర్విధివినిర్మితి

(అలంకారశిరోభూషణే శబ్దాలంకారప్రకరణం-24)

(శ్యామలాంగుడైన విష్ణువు తాను ఉద్ధరించిన
భూమిపై అవతరించి రాక్షస సంహారం చేయగా
సృష్టియందు అందరికోరికలు సిద్ధించినవి.
యాగాలు సఫలీకృతమైనవి.)

## కొమ్ముల పద్యం

కేవలం కొమ్ములతోటి కూర్చిన పద్యం గమనిద్దాం.
ఇందులో ఉ,ఊ - స్వరాలను మాత్రమే ఉపయోగించటం చిత్రం
వీటిని ఏకస్వర చిత్రం అనికూడా అంటాము.

పూషుఁడు నుడుపుఁడును భూజుండును బుధుఁడు
న్గురు సుగుణుఁడు గురుఁడును సుకురుఁడును

సూరుసుతుఁడు నుడుపుసూడు ధూమ్రుఁడు భూపు
శూరు నుసులు పూన్చుచుంద్రు సుమ్ము
(సారంగధరీయము 0-8)

(సూర్యుడును, చంద్రుడును, అంగారకుడు,
బుధుడును, బృహస్పతియును,
శుక్రుడును, శనియు, రాహువును, కేతువును,
కృతిపతియగు రాజును
సౌఖ్యమును పొందింతురు సుమీ
- అని అర్థం.)

## ఏత్వకందం

ఏత్వకందం. ఎ,ఏ - స్వరములతో కూడిన కందం.
ఇది కూడా ఏకస్వరచిత్రమే.

కే లేదే తే తేపే
పే లేపే మెట్లె దేబెపే యేల్చేడె
న్నే లేనే వేరే యె
గ్గే లేనే లేదే యేడ్చేదేలే మేలే
(సారంగధరీయము - 3-43)

కేలు = హస్తము, ఏదే = ఎచ్చటనే, తే తేపే = తెమ్ము తెమ్ము,
పే = శీఘ్రముగా, లేపేమెట్లె = లేవపేమి ఎట్లనే,
దేబెపే = దీనురాలవా, ఏల్చేడెన్ = రక్షించువనితను,
నేలేనే = నేనుండలేదా, పే = పేరుగా,
ఎగ్గేలేనేలేదె = కీడు లేక దోషం లేనేలేదె,
ఏడ్చేదేలే = ఏడ్చెదవెందులకు,
మేమే = శుభమా?

## దీర్ఘ ఏక స్వరచిత్రం

ఒక శ్లోకం లేదా పద్యంలో ఒకేఒక స్వరం(అచ్చు)వాడితే
అది ఏకస్వరచిత్రం దానిలో కేవలం దీర్ఘస్వరాలనే వాడితే
అది దీర్ఘ ఏకస్వరచిత్రం అవుతుంది.
ఈ శ్లోకం చూడండి.

పైధై రైనై రైశై రైంద్రై రైజై రైలై ర్జైనై: సైద్ధై:
మైత్రై ర్చైకై ర్దై ర్వై ర్వై రై దై: స్వై: స్వైరై ర్దైవైస్తైః
(సరస్వతీకంఠాభరణము)

దీనిలో అంతటా "ఐ" -త్వమే ఉపయోగించి

శ్లోకం కూర్చడమైనది.

కావున దీన్ని

"ఐ" - త్వ శ్లోకం అనికూడా పిలువవచ్చు.

అర్థం - బ్రహ్మ, విష్ణువు, ఈశ్వరుడు, ఇంద్రుడు, మన్మథుడు, భూమి,

జినుడు, సిద్ధులు, సూర్యుడు కుబేరుడు అనువారికి సంబంధించిన

వారిచేత, అనేక దేవతల చేతను సుష్టుగా ఒసగబడిన

వారివారి ధైర్యములచేత సమగ్రముగా సమృద్ధి నొందుదును.

## దీర్ఘ ద్వి స్వరచిత్రం

రెండు దీర్ఘాచ్చులతోటి కూర్చబడిన పద్యం

లేక శ్లోకంను దీర్ఘ ద్వి స్వరచిత్రం అంటాము.

శ్రీ దీప్తీ హ్రీ కీర్తీ ధీనీతీ గీ ప్రీతీ

ఏధేతే ద్వే ద్వే తేయే నేమే దేవేశే

(కావ్యాదర్శము- 3- 86)

(దేవేంద్రుని యందుకూడ లేని శోభాదీప్తులు,

లజ్జాకీర్తులు, బుద్ధినీతులు, వాక్ప్రేమలు

రెండు రెండు నీకు వృద్ధినొందుచున్నవి.)

దీనిలో మొదటి అర్థము అనగా శ్లోకము పూర్వభాగము అంతా ఈ - స్వరంతోను,

రెండవ భాగము అనగా ఉత్తరార్థశ్లోకం అంతా ఏ - స్వరం తోను కూర్చబడినది.

ఈ రెండును దీర్ఘ స్వరములే

కావున

ఇది దీర్ఘ ద్వి స్వరచిత్రం.

## దీర్ఘ చతు:స్వర చిత్రం .

నాలుగు స్వరాలు(అచ్చులు) ఉపయోగించి కూర్చిన

శ్లోకం లేదా పద్యంను చతుస్స్వరనియమము అంటారు.

అది దీర్ఘాలతో కూర్చిన దీర్ఘచతుస్స్వరనియమము అంటాము.

ఇప్పుడు చెప్పుకునే ఉదాహరణ అన్నీ దీర్ఘాలతో కూడినది.

ఆమ్నాయా నామాహాంత్యా వాగ్గీతీ రీతీ: ప్రీతీ ర్భీతీ:

భోగో రోగో మోహూ మోదో ధ్యేయే వేచ్ఛేత్ క్షేమే దేశే

(సరస్వతీకంఠాభరణము - 2-281)

(వేదములకు తుదినున్న వాక్కు(వేదాంతము)

గీతులను ఈతిబాధలని, ఇష్టములను భయములని,

భోగమే రోగమని, మోదమే మోహమని కావున

క్షేమకరమైన క్షేత్రములందు ధ్యానమునందు ధ్యేయుడైన

పరమాత్మయందు మనస్సును నిల్పమని చెప్పెను.)

ఈ శ్లోకంలోని నాలుగు పాదాలలో

1వ పాదంనందు ఆ,

2వ పాదంనందు ఈ,

3వ పాదంనందు ఓ,

4వ పాదంనందు ఏ

- అనే నాలుగు దీర్ఘ స్వరము(అచ్చు)లను

వాడడంజరిగింది.

రామాసామారామా
కీమీ స్ఫీతీ నీశ్రీ
రోమోద్భోదోద్యోగో
త్ప్రేమేభేంద్రేడ్యేట్టే (3-87)

ఇది ఆంధ్రకావ్యాదర్శములోనిది

దీనిలో ప్రతిపాదానికి ఒక స్వరం చొప్పన నాలుగు పాదాలకు నాలుగు స్వరాలు

అవి దీర్ఘస్వరాలతో కూర్చబడ్డాయి.

మొదటిపాదం - "ఆ",

2వ పాదం - "ఈ",

3వ పాదం- "ఓ",

4వ పాదం - "ఏ"

- అనే స్వరాలు తీసుకోవడం జరిగింది.

(రామా, సామ - సామవేదం, ఆరామ - విరామస్థానంగా గలవాడా,

కీ - సుఖముగలవాడా, మీ - లక్ష్మిగలవాడా, భీ - కాంతిగలవారియొక్క,

ఇతీ - పొందుటగలవాడా, అధవాభీ - కాంతిగలవాడా, ఇతీ - జ్ఞానముగలవాడా,

నీశ్రీ. రోమోద్భోధ - రోమాంచముయొక్క, ఉద్యోగ - ఎక్కువగా కూర్చుటగల,

ఉత్ప్రేమ - గొప్పభక్తిగల, ఇభేంద్ర - గజేంద్రునిచే, ఈడ్య - స్తుతింపదగ్గ,

ఈట్టే - ప్రభవిష్ణువే - నీశోభ భక్తశ్లాఘ్యమును దురితహరణ సమర్ధముననుట)

ఇది స్వరముతోటి కూడిన చిత్రం.

కావున ఇది "స్వరచిత్రం".

## హ్రస్వ ఏక స్వరచిత్రం

హ్రస్వమైన ఒకేఒక స్వరాన్ని ఉపయోగించి పద్యం

కూర్చటాన్ని హ్రస్వ ఏక స్వరచిత్రం అంటారు.

ఇందులో స్వరం ఒకటే ఉంటుంది కాని వ్యంజనాలు

ఏవైనా ఉండవచ్చు.

ఇక్కడ స్వరం యొక్క దీర్ఘ, హ్రస్వములేకాని

గురు లఘువులతో సంబంధంలేదు.

ఉరుగుం ద్యుగురుం యుత్సు చుక్రుశు స్తుష్టువు: పురు
లులుభు: పుపుర్షుర్ముత్సు ముముహుర్ను ముహుర్ముహు:
(సరస్వతీకంఠాభరణము - 2 - 276)

(విలువైన వాక్కులు గల దేవతా గురువైన బృహస్పతిని
యుద్ధములందు భటులు శరణు కోరిరి మిక్కిలి స్తుతించిరి
మోదములందు లోభమును పొందిరి పుష్టినొందిరి
మరి మాటి మాటికిని మోహము నొందిరి.)

ఇందులో హ్రస్వ "ఉ" - కారమును ఒక్కదానినే
మొదటినుండి చివరవరకు ఉపయోగించారు.
ఒకే స్వరము అదియు హ్రస్వము ఉపయోగించుట
వలన ఇది హ్రస్వ ఏక స్వరచిత్రమగుచున్నది.

## సర్వలఘుచిత్రం

శ్రీహర్షనైషధంలోని ఈ శ్లోకం చూడండి.
ఇందులో అన్నీ లఘువులే అందువల్ల దీన్ని
సర్వలఘుచిత్రం అంటారు.
నలదమయంతులు వివాహానంతరపు శ్లోకం ఇది.

శుచిరుచిముడు గణమగణనమముమతి
కలయసి కృశతను నగగనతటమను
ప్రతినిశ శశితల విగలదమృతభృత
రవిరథ హయచయ ఖురబిల కులమివ
(శ్రీహర్ష నైషధము - 22-146)

ఓ కృశాంగీ! ఆకసపు ప్రదేశమున తెల్లనికాంతి కలిగినదై ఎక్కువగా
ఉండుటవలన లెక్కింప సాధ్యము కానిదై కేవలము వ్రేలితో చూపదగి
ప్రత్యక్షగమ్యమై ఉండు నక్షత్రగణమును ప్రతిరాత్రీ చంద్రుని
దిగువభాగమునుండి స్రవించు తెల్లని అమృతముచే నిండిన
సూర్యాశ్వముల గిట్టల రంధ్రముల యొక్క సమూహముగా భావింపుము.
ప్రతిరాత్రీ చంద్రుని నుండి స్రవించే తెల్లని అమృతముతో నిండిన సూర్యుని
గుఱ్ఱము గిట్టల రంధ్రములు నక్షత్రములవలె శోభించుచున్నవి- అని భావం.

## సర్వలఘు కందం

కందపద్యంలో అన్ని గణాలు లఘువులయితే దాన్ని సర్వలఘుకందం అంటాము. కానీ రెండు, నాలుగు పాదాంతాలలో గురువు ఉంటుంది. ఇలాంటిది తెలుగులో మొదట నన్నెచోడుడు కుమారసంభవం(10వ ఆశ్వాసం 187వ పద్యం)లో రచించాడు.

తగుఁదగదని మనమున మును
వగవఁగ నొడఁబడఁగ వగవ వగవఁగఁబడయున్
దగుఁదగ దని వగ వని వగ
వగవఁగఁ బని గలదె తనకు వగ మఱి జగతిన్

తారకాసురునితో శుక్రాచార్యుడు - కుమారస్వామితో యుద్ధానికి వెళ్ళేసమయములో కొంత నీతిబోధ చేస్తూ అన్న పద్యమిది.

"ఈ పని చేయతగును ఈ పని చేయకూడదని మనసులో ముందుగా విచారించాలి. అలా ఆలోచించగా కర్త్యం బోధపడుతుంది. ఇది చెయ్యవచ్చు ఇది చెయ్యకూడదు అని ముందుగా ఆలోచింపని విధం తనకు లోకానికి మిక్కిలి దుఖం కలిగిస్తుంది తరువాత విచారించి ప్రయోజనంలేదు." అని భావం.

ఇలాంటి పద్యమే పోతన గజేంద్రమోక్షణంలో గజేంద్రుని రక్షింపబోవు విష్ణువుతో లక్ష్మీదేవి తత్తరపడుతూ వెళుతూన్న ఆమె మనసులోని భావాన్ని ఈ పద్యంగా చిత్రించారు పోతన.

అడిగెదనని కడువడిఁజను
నడిగినఁ దను మగుడ నుడువడని నడయుడుగున్
వెడవెడ సిడిముడి తడఁబడ
నడుగిడు నడుగిడదు జడిమ నడుగిడు నెడలన్

(శ్రీమదాంధ్రమహాభాగవతం - 8- 103)

## సర్వగురు చిత్రం

ఒక పద్యంకాని, శ్లోకంకాని, వచనంకాని అన్నీ గురువులే
ఉంటే దాన్ని సర్వగురు చిత్రం అంటారు.
ఇది దండి కావ్యాదర్శం లోనిది.

అమ్నాయానా మాహన్త్యావాగ్గీతీ రీతీః ప్రీతీభీతీః
భోగోలోగో మోదో మోహొధ్యేయే వేచ్ఛేద్దేశేక్షేమే

**(కావ్యాదర్శమ్ -3-84)**

అర్థం -
అమ్నాయానాం - వేదాలలో, అన్త్యా - చివరిదైన ఉపనిషత్తు, గీతీ: - గానములను, ఈతీ: - ఈతిబాధలుగాను, ప్రీతీ: - దారాపుత్రాదులందు ప్రేమలను, భీతీ: - భయస్వరూపములైనట్టివిగాను, అహ - చెప్పుచున్నది. భోగ: - విషయోపభోగము, రోగ: - రోగహేతువు, మోద: - సాంసారిక సుఖానుభవము, మోహ: - అవివేకరూపమైనది, అందుచే, క్షేమే - పరమాదరహితమైన, దేశే - ఏకాంత ప్రదేశంలో, ధ్యేయేవా - ధ్యేయమగు పరమాత్మస్వరూపంనందు, ఇచ్ఛేత్ - మనసును నిలుపుటకు కోరుకొనవలెను.

## సర్వగురువచనము

ఒక పద్యంకాని, శ్లోకంకాని, వచనంకాని అన్నీ గురువులే
ఉంటే దాన్ని సర్వగురు చిత్రం అంటారు.
అదే వచనం అయితే సర్వగురు వచనమని,
పద్యం అయితే సర్వగురు పద్యం అని అంటారు.

ఇక్కడ

గణపవరపు వేంకటకవి ప్రణీతమైన

"ప్రబంధరాజ వేంకటేశ్వర విజయవిలాసము"

లోని 447ది.

చూడండి.

వ. ఆవేశం దాశ్చర్యారూఢాత్మాం

భోజాతోద్యత్కందర్పాటోపస్ఫాయన్నా

రాచస్తోమశ్రేష్ఠోద్బోధాదీనాం చ ద్బోధానైపుణ్య

ప్రౌఢిశ్రీనారీరత్నం నిట్లూహించెన్.

## అపునరుక్త వ్యంజనము

వచ్చిన హల్లు మళ్ళీ రాకుండా పద్యం కూర్చితే దాన్ని అపునరుక్త వ్యంజనము అంటారు.

ఇది ఒక శబ్దచిత్రం

ఈ విధమైన వాటిని ఎక్కువగా సంస్కృతంలో చూడవచ్చు.

వేదాంతదేశికుల "పాదుకాసహస్రం" లో చిత్రపద్ధతి పేరున 911-950 శ్లోకాలు కూర్చబడ్డాయి.

920 వ శ్లోకం ఈరకమైన "అపునరుక్త వ్యంజనము" చిత్రరచన చేశారు.

బాఢా ఘూళీ ఝూటతుచ్ఛే గాధాభనాయపుల్లఖే

సమాధౌశఠజిచ్చూడాం వృణోషిహిపాదుకే

భావం:- ఓ భగవత్పాదుకా దృఢమైన పాపసముదాయమనే అడవిలేనట్టి, వికసించిన మనస్సుగల సమాధియోగమందు దివ్యప్రబంధాన్ని ప్రకాశింపచేయడానికి నీవు శఠగోపసూరి శిరస్సును వరిస్తున్నావు.

ఈ శ్లోకం గమనిస్తే వచ్చిన హల్లు మళ్ళీ రాలేదు కావున ఇది అపునరుక్త వ్యంజన చిత్రం

ఈ శ్లోకం చూడండి వచ్చిన హల్లు మళ్ళీ వచ్చిందేమో.

హతోచ్చండో ఢాఘ ఝూటావేల్లిదోషా మిళచ్ఛరం

ఫణిశయ్యం రఙ్గనాథం భజే బుధ సుఖావకమ్

(అలంకారశిరోభూషణే శబ్దాలంకారప్రకరణం-20)

(క్రూరపాపులు అయిన రాక్షసులను హతమార్చిన వానిని,

నాగేంద్రునిపానుపుగా కలిగిన వానిని,

దేవతలకు జ్ఞానులకు సుఖములను కూర్చువానిని

శ్రీరంగనాథుని సేవిస్తాను.)

### క్రమస్థ సర్వవ్యంజనం

క్రమంగా క- వర్ణం మొదలు హ - వర్ణం వరకు ఉన్న

అన్ని హల్లులను ఉపయోగించి రచించిన వర్ణచిత్రం

ఈ క్రమస్థ సర్వవ్యంజనం.

దీనికి భోజమహారాజు రచించిన "సరస్వతీకంఠాభరణము"

శబ్దవివేచనం లోనిది ఉదాహరణ

చూడండి.

క: ఖగౌ ఘాఙ చిచ్ఛౌ జా ఝాఞ్ జ్ఞో2టౌఠీడడంఢణ:

తథోదధీ న్పఫర్బాభీర్మయో2రిల్వాశిషాంసహ: (263)

(దేవతల సమూహముచేత పూజింపబడువాడును,

అజ్ఞానమును ఛేదించెడి ఓజస్సు గలవాడును,

శత్రుబలములను ఆరగించువాడును,

పండితుడును యుద్ధభటులను బాధించువారికి ప్రభువును,

అచంచలుడును, అంబుధులను పూరగించినవాడును,

భయములేనివాడును ఎవడు శత్రుసంహారకములైన

ఆశీస్సులను భరించెడి మయుడు(అనెడి దైత్యరాజు))

ఈ శ్లోకంలో

వరుస క్రమంలో

అన్ని హల్లులు వచ్చినవి.

కావున

ఇది క్రమస్థ సర్వవ్యంజనము.

## స్థానచిత్రం

అక్షరముల ఉత్పత్తి స్థానమును బట్టి

కంఠము, తాలువు, మూర్ధము, దంతము, ఓష్ఠము అని ఐదు

విధములని తెలుసుకొని ఉన్నాము.

వీటిలో కేవలము కంఠస్థానమున పుట్టెడి అక్షరములతో

పద్యం కూర్చిన అది కంఠ్యము అని,

ఒకవేళ కంఠస్థానమున ఉత్పత్తి అయ్యే అక్షరములను వదలి

మిగిలిన వాటితో పద్యం కూర్చిన కంఠ్యములు లేనిది

నిష్కంఠ్యము అని పిలువబడుచున్నది.

### ఏకస్థాన చిత్రం

కంఠము, తాలువు, మూర్ధము, దంతము, ఓష్ఠము అనే

ఈ అయిదు వర్ణ ఉత్పత్తి స్థానములు.

కంఠం నందు పుట్టేవాటిని కంఠ్యములు అని అంటారు.

ఒక ఉత్పత్తిస్థానంనుండి పుట్టే వాటిని తీసుకొని కూర్చిన

దాన్ని ఏకస్థాన చిత్రం అంటారు.

మిగిలిన వర్ణోత్పత్తి స్థానాలను

పరిహరించడం జరుగుతుంది.

ఈ శ్లోకం దండి కావ్యాదర్శంలోనిది చూడండి.

అగా గాం గాంగకాకాంక గాహకాఘుక కాకహా

అహాహాంగఖగాం కాగగ కంకాగ ఖగాంకగ

(హానిలేని అంగముగల సూర్యుని(గరుడుని)గుర్తుగా

ధరించిన పర్వతము(మేరువు)నందు సంచరించు

కంఖములనెడి పర్వతపక్షులచేత

ప్రస్తుతిగొన్న గమనము కలవాడా!

గంగాజలము నందలి కుటిలమైన

అంకమునందు ప్రేలాడుచున్న కుత్సితపాప

మనెడి కాకమును(చంపినవాడవేని)చంపి

స్వర్గమునకు పోయితివి.)

అ,ఆ,క,ఖ,గ,ఘు,ఙ,హ,(విసర్గ)-

అనేవి కంఠమునుండి పుట్టేవి

కావున

వీటిని కంఠ్యములు అంటారు.

ఈ శ్లోకంలో ఈ చెప్పబడిన వాటినుండి మాత్రమే

తీసుకొని శ్లోకం కూర్చడం జరిగింది.

కావున

ఇది ఏకస్థానచిత్రం అనదగినదే.

## సౌష్ఠ్యవ్యంజనం

సౌష్ఠ్యవ్యంజనం అంటే స + ఒష్ఠ్య = పెదవులతో పలుకబడే

వ్యంజనం (హల్లు) అక్షరాలతో కూర్చబడిన పద్యం.

అచ్చులు లేకుండా పెదవులతో పలికే హల్లులతోటి కూర్చబడినది సౌష్ఠ్యవ్యంజనం.

ఆ హల్లులు ప, ఫ, బ, భ,మ, వ - అనేవి. వీటిలో

కొన్నిగాని అన్నీగాని తీసుకొని

వ్రాయబడేది సౌష్ఠ్యవ్యంజనం.

దీన్ని ఏకస్థాన చిత్రం అనికూడ అంటారు.

భవభోమ మమా భామా భూమి వామా విభోభువి

భీమభీవైభవావాపీ పావభూమ భవాంబు పాః

(అలంకారశిరోభూషణే శబ్దాలంకారప్రకరణం-22)

(శ్రీదేవీ భూదేవి విభుడవైన ఓ రంగనాథా!

భువిలో మాకు భవభయాపహరుడవు కమ్ము.)

ఈ శ్లోకంలో ప,భ, మ, వ అనే నాలుగు హల్లులే

తీసుకొని వ్రాయడం వల్ల దీన్ని "చతురక్షరి" అనికూడ అంటారు.

## నిరోష్ఠ్యం

ఓష్ఠం అంటే పెదవి.

ఓష్ఠ్యం అంటే పెదవులయందు పుట్టేది.

వ్యాకరణ పరిభాషలో ఓష్ఠ్యం అంటే పెదవుల కలయికతో

పలకడానికి వీలయ్యే అక్షరం.

నిరోష్ఠ్యం అంటే పెదవుల

కలయికతో అవసరంలేకుండా పలుకబడేవి.

ప,ఫ,బ,భ,మ,వ,ఉ,ఊ,ఒ,ఓ,ఔ - అనేవి

పెదవుల సాయంతో పలుకబడేవి.

ఇవి లేకుండా పద్యం లేక శ్లోకం లేక వచనం లేక దండకం

ఇలా ఏదైనా రాస్తే అది నిరోష్ఠ్యం అవుతుంది.

అథాగ్రే హసతా సాచిస్థితేన స్థిరకీర్తనా

సేనాన్యా తేజగదిరే కించిదాయస్తచేతసా

(కిరాతార్జునీయమ్ - 15-7)

(ఈవిధంగా పరుగెత్తిపోతున్న సేనను చూచి

వారికెదురుగా ముందుభాగంలో నిలిచి సేనాని

కార్తికేయుడు ఖిన్నులైన ప్రమథగణంతో

ఇట్లా అన్నాడు.)

ఈ శ్లోకంలో ఒక అక్షరంకూడా పెదవిస్పర్శకలదిగాలేదు.

కావున

ఇది నిరోష్ఠ్యం.

## సౌష్ఠ్యనిరోష్ఠ్య (ఓష్ఠ్యనిరోష్ఠ్య) సంకర చిత్రం

పెదవితో పలికే హల్లు(అక్షరం),

పెదవితో పలకని హల్లు(అక్షరం)

ఈ విధంగా ఒకదాని తరువాత ఒకటి కూర్చితే

అది సౌష్ఠ్యనిరోష్ఠ్య (ఓష్ఠ్యనిరోష్ఠ్య) సంకర చిత్రం అవుతుంది.

ఈ శ్లోకం చూడండి.

భోగి భోగాభోగభూరే పుణ్యైముక్తే: వురేవుషి

భూరి బోధముదం భూతిం పుష్యభోన: పున: పున:

(అలంకారశిరోభూషణే శబ్దాలంకారప్రకరణం-23)

(ఓ రంగనాథా మాకు జ్ఞానానందాన్నీ,

ఐశ్వర్యాన్నీ ఇచ్చి మాటిమాటికీ పుష్టిని ఇమ్ము.)

ఈ శ్లోకంలో ఒక ఓష్ఠ్యాన్ని, ఒక నిరోష్ఠ్యాన్నీ క్రమంగా

ఒకదాని తరువాత ఒకటిగా కూర్చారు.

అంటే శ్లోకంలోని 32 అక్షరాల్లో 16 ఓష్ఠ్యాక్షరాలు,

16 నిరోష్ఠ్యాక్షరాలు ఉన్నాయి గమనించండి.

## నిస్తాలవ్యం

తాలువులతో కూర్చిన తాల్యము అని,

తాలువులతో కాక మిగిలిన వాటితో కూర్చిన నిస్తాలవ్యమని అందురు.

మరి, తాలువు = దవుడ, దవుడ నుండి పుట్టేవాటిని తాలువులు అంటారు.

తాలువులయందు పుట్టు అక్షరములు - ఇ-వర్ణము(స్వరము),

చ- వర్గము(చ,ఛ,జ,ఝ,ఞ), య-కారము, శ-కారము ఇవి తాలవ్యములు.

ఇవి లేకుండా పద్యం లేక శ్లోకం కూర్చిన అది నిస్తాలవ్యము.

ఉదాహరణ గమనిద్దాం-

స్ఫురత్కుండల రత్నౌఘ మఘవద్ధను కర్బురః

మేఘనాదో2థ సంగ్రామే ప్రావృట్కాలవదాబభౌ

(సరస్వతీకంఠాభరణము -2-268)

(ప్రకాశించుచున్న కర్ణభూషణరత్న సమూహమనెడి

హరివిల్లుచేత పొడలుగలిగినవాడై సంగ్రామమునందు మేఘనాధుడు(ఇంద్రజిత్తు) ప్రావృట్కాలము

వలె ప్రకాశించెను.)

(ప్రావృట్టు = వర్షర్తువు)

ఈ శ్లోకంలో పై చెప్పిన అక్షరాలు ఉన్నాయేమో? గమనించండి.

ఉంటే భోజమహారాజును నిలదీద్దాం.

ఆ అక్షరాలు మరొక్కసారి చూస్తారా- ఇవే

ఇ-వర్ణము(స్వరము), చ- వర్గము(చ,ఛ,జ,ఝ,ఞ), య-కారము, శ-కారము.

## వర్గపంచరహిత పద్యం

హల్లులలో క - వర్గము, చ - వర్గము,ట - వర్గము,

త - వర్గము,ప - వర్గము అని 5 వర్గాలు.

క - మొదలు మ - వరకు ఉన్న హల్లులు కాకుండా

మిగిలిన హల్లులను ఉపయోగించి పద్యం కూర్చడం

వర్గపంచకరహితము.

హర,హీర, సారసారి, హరశైల, వాసవో

ర్వీరుహ, హిహర, శేషవేషహసలాలస

శ్రీరసోరుయాశసాంశుశీల వైరివీరసం

హర! సారశౌర్యసూర్య హర్యవార్యసాహసా

(కావ్యాలంకారసంగ్రహము 5-245)

(హీరము - మణి, సారసారి - చంద్రుడు,

హరశైలము - కైలాసము, అహిహరుడు - శివుడు,

యాశసాంశుశీల - కీర్తికాంతులచే ఒప్పువాడు,

సూర్యహర్యవార్య సాహసా - సూర్యుని అశ్వములచేతను

వారింపరాని (చొఱవగల) సాహసము కలవాడా)

ఈ పద్యంలో క - మొదలు, మ - వరకు గల హల్లులు

ఏవికూడ వాడలేదు

కావున

ఇది వర్గపంచకరహిత పద్యమైనది.

ఇది శబ్దచిత్రంలోని ఒక రకము.

## అచలజిహ్వ

ఒక పద్యంకాని శ్లోకంకాని నాలుక కదలకుండా పలికే అక్షరాలతో

కూర్చితే దాన్ని "అచలజిహ్వ" అంటారు.

"ఆయలూరు కందాళయార్య" విరచిత "అలంకారశిరోభూషణే "

శబ్దాలంకారప్రకరణంలోనిది ఈ శ్లోకం.

చూడండి నాలుక కదులుతుందేమో!

భవభామా భావగాహ బహుంభామా మవాభవ

మమ భోభవభూమావ భవభూపా వభూమహ

(పార్వతీదేవి యొక్క హృదయమందు చేరినవాడా(శ్రీరామనామ రూపంతో

ఆమె హృదయమందున్నవాడు) అధిక తేజస్సంపన్నుడా! సంసారగంధ గ్రహితుడా

శ్రీ భూవల్లభా! సంసార మండలంలో కలిగిన పాపాధిత్యా నశింపచేయువాడా!

నన్ను రక్షించు)

నాలుక కదలకుండా చదవవీలయ్యే పద్యం శ్లోకం తెలుసుకొని ఉన్నాము.

దీన్ని అచలజిహ్వ అంటారనీ తెలుసుకొన్నాము.

మరొక ఉదాహరణ ఇక్కడ గమనిద్దాం.

ఇది "నరసభూపాలీయము"ని పేరొందిన

"కావ్యాలంకారసంగ్రహము"(3-160)లోనిది.

భోగాంబువాహవాహవి

భాగేహాభావుకాంగభావభవమహా

భాగమహీభాగమహా

భోగావహబాహుంభోగిపుంవభోగా

ఇది చదివే సమయంలో

నాలుక కదలదు

కావున

దీన్ని "అచలజిహ్వ" అంటున్నారు.

భోగాంబువాహవాహా = సుఖానుభవమున ఇంద్రుడైనవాడా,

విభాగేహా = కాంతికి స్థానమైనవాడా,

భావుకాంగభావభవ = భవ్యదేహమున మన్మథుడైనవాడా,

మహీభాగ మహాభోగావహ = భూభాగమున గొప్ప భోగములను పొందిన,

బాహు = బాహువనెడు,

భోగిపుంగవ = పాముయొక్క,

భోగా = భోగము(పడగ)కలవాడా!-

అనగా

నరసరాజు అజచేయి పడగవలెను,

అతని బాహువులు పాముపలెను ఉన్నవని - భావము.

## అచలజిహ్వ- శుద్ధౌష్ఠ్యం

నాలుక కదలకుండా మరియు పెవులుమాత్రమే

కదులుతూ చదివే పద్యం

ఉదాహృత పద్యం

కొడవలూరి రామచంద్రరాజుగారి

"మహాసేనోదయము" (2-252)లోనిది.

భావ భవోప మవామా

భావి భవా భవ భావ  పాపా విపవీ

భూ విభు బోమా వాపా

భావామ విభోప భవప భభవ ప్రభువా

ఈపద్యం చదివే సమయంలో

ఎక్కడైనా నాలుక కదలుతుందేమో

గమనించండి.

## చలజిహ్వ

అచలజిహ్వ - అని నాలుక కదలకుండా

చదివే పద్యలను శ్లోకాలను చూశాము.

ఇపుడు చలజిహ్వ అంటే కేవలం నాలుకమాత్రమే

కదులుతూ చదివే శ్లోక - పద్యాలు.

చూడండిమరి.

దనుజారిర్నతో ధాతృ ధూర్జటీన్ద్రాది నిర్జరై:

దురితం తటినీరత్నోదరే దో ధోతునిద్రిత:

(అలంకారశిరోమణే శబ్దాలంకారప్రకరణం-36)

(బ్రహ్మ, శివుడు, ఇంద్రుడు మొదలయిన దేవతలచే

నమస్కరించబడిన వాడున్నూ,

నదులనూ రత్నాలనూ గర్భంలో నిలుపుకొన్న

సముద్రమునందు నిద్రించు వాడున్నూ

రాక్షస వైరియూ అయిన

శ్రీరంగనాధుడు

మా పాపాలను విదలించి

రూపుమాపుగాక!)

చదివారుకదా నాలుక మాత్రమే కదలుతూందికదా!

ఇది ఏ అక్షరాలకు నాలుక కదలుతుందో

వాటిచే మాత్రమే కూర్చబడినది.

## సరిగమల - పద్యం

ఒకమారు పీఠాపురం రాజావారి దివాణంలో ప్రభు సమక్షంలో తుమురాడ సంగమేశ్వరశాస్త్రిగారి వీణకచ్చేరి జరిగింది. వచ్చిన శ్రోతల్లో పానుగంటివారు ఒకరట. వీణాగానం తర్వాత సంగమేశ్వర శాస్త్రిగారిని అభినందస్తున్న మహారాజును ప్రశంసిస్తూ పానుగంటివారు చెప్పిన పద్యం ఇది.

స్వజనుల నేరీతిఁబరిపాలన మొనర్తు నాశ్రితు నెవ్వాని నాదరింతు

వాదాయమున నెంత యర్థుల కిచ్చెద వెదెటు చేసిన భృత్యు నెదగణింతు

నవని పాలన నేది యార్జించినాఁడవు కవితగానంబు నేపగిది విందు

వెట్లుగాఁబృథు సౌఖ్య మీక్షింపఁగా నుంటి వాత్మ సంస్తుతుల కేమందు వయ్య

సరిగ, ధని, సగమ పనిని సరిగ, గరిమ

మరిమరిగ, పాపనినిగని, సరిసర్ యను

వీణకాని "మా" వెన్క "నీ" వీణ వరుస

మీఁద "నీ" వెన్క "మా" సూర్యమేదినీశ

సీసపద్యంలోని ఎనిమిది ప్రశ్నలకు ఎత్తుగీతిలో వీణా స్వరవిన్యాసంతో జవాబులిచ్చారు.

1.ప్ర- స్వజనుల నేరీతిఁబరిపాలన మొనర్తు - సరిగ

2.ప్ర- నాశ్రితునెవ్వాని నాచరింతువు - ధని

3.ప్ర- ఆదాయమున నెంత యర్థుల కిచ్చెదవు - సగమ

4.ప్ర- ఎదెటు చేసిన భృత్యు నెదగణింతువా - పనిని సరిగ

5.ప్ర- అవని పాలన నేది యార్జించినాఁడవు - గరిమ

6.ప్ర- కవితగానంబు నేపగిది విందువు - మరిమరిగ

7.ప్ర- ఎట్లుగాఁబృథు సౌఖ్య మీక్షింపఁగా నుంటివి - పాపనినిగని

8.ప్ర- ఆత్మ సంస్తుతులకేమందు వయ్య - సరిసరి

అని ప్రశ్నలకు జవాబులు ఉన్నాయి.

ఇంకా చమత్కార మేమంటే "ఓ మహారాజా! ఈ వీణ వరుసమీద ఆరోహణావరోహణ క్రమంలో "మా వెన్కనీ" అంటున్నది. కాని "నీ వెన్క" "మా" అన్నది ఉంటుంది. "మా" అంటే లక్ష్మి. నీ వెనుక లక్ష్మిగాని, లక్ష్మి వెనుక నీవు ఉండవు అని భావం.

## శబ్దనానార్థోపయోగచిత్రం

ఒక శబ్దాన్ని అనేక అర్థాలలో ఉపయోగించుట జరిగితే

దాన్ని "శబ్దనానార్థోపయోగచిత్రం" అంటారు.

ఈ క్రింది ఉదాహరణ చూడండి.

హరి యగు నా కల్కి ముఖము
హరి యగు నా కల్కినుడులు హరి యగు జడయున్
హరి యగు నా కల్కి నడుము
హరి వేరే కల్కిరూపమగుటేల యిలన్

(సారంగధరీయము 2-144)

దీనిలో హరి శబ్దానికి వరుసగా

చంద్రుడు, చిలుక, సర్పము, సింహము, విష్ణువుగా

అర్థాలు తీసుకోబడింది.

ఆ కల్కి ముఖము చంద్రుడని,

పలుకులు చిలుకలని,

జడ సర్పమని,

నడుము సింహమని

స్వభావార్థము.

ఆ కల్కి ముఖాద్యవయవములు

హరి వాచ్యములగుచున్నవి.

హరికి (విష్ణువుకు) తనివిదీరక పేరుగా

మోహిని అనే రూపం తాల్చడం దేనికి,

లేక

కల్క్యవతారం దాల్చడందేనికి

అని భావం.

## గుణిత చిత్రం

ఒక పద్యంలో ఒక హల్లుకు తలకట్టు మొదలు ఔత్వం వరకు లేదా

విసర్గవరకు కూర్చడం. ఉదాహరణకు రాధికా సాంత్వనము లోని ఈ పద్యం చూద్దాం.

ఇది ఒకరకమైన గుణితచిత్ర పద్యం

తరుణీ మన్మథ తామసాంత తిమిరోద్య చ్ఛాయ తీర్థాంఘ్రి పు
ష్కర మా తూర్ణగవైనతేయ హయ తేజస్సూర్యత్రైక్ణ్యోజ్జ్వల
ధ్వర చక్రాయుధ తోయజాత నయనా తౌషార శుభ్ర ప్రభా
కర కీర్తి ప్రద తంద్రికేతర చిరాఖ్యా తస్క రాగ్రేసరా (2-145)

ఇందులో "త" - గుణితం కూర్చబడినది. రంగులో ఇవ్వబడిన అక్షరాలను

చూస్తే తెలుస్తుంది. కాని ఇందులో "త, తా, తి, తీ, తూ, తే, త్రై, తో, తౌ, తం, తః "- లు మాత్రమే

కూర్చబడ్డాయి "ఎ,ఒ"-లు సంస్కృతంలో ఉండవు కావున వాటిని కూర్చరు.

మరోరకం గుణిత పద్యాన్ని ఇప్పుడు చూద్దాం.

రెండవ రకం గుణింత పద్యం

అది ఒక రకము కాగా సగం పద్యంలోనే గుణింమంతా రావడం రెండవ రకం గుణింత పద్యం.

అంటే ఒక పద్యంలో రెండు గుణింతాలు కూడా కూర్చిన వారున్నారు.

ఈ పద్యం గణపవరపు వేంకటకవి

"ప్రబంధరాజ వేంకటేశ్వర విజయవిలాసము"లోని

148వ పద్యం.

గడి గాటపు గిరి గీముల

గుడి గూబల గెబ్బు గైత గొల్లలు గౌలన్

(దడలుచు గండరిగర్వము

విడుతురు నీరిపులు జేరి వేంకటశౌరీ)

వరరాముఁగోరిరీతఁడు

గురురూపిమ రేవురైయెకుదిరిరొయొనరౌ

నరనాధునిరతినీచుల

నురినూకువనేర్పనైననోపికనౌఁగా

(ఉరిన్ - ఉచ్చులో, ఊకువన్ - పూనికను, ఏర్పన్ - ఏర్పరచుట)

ఈ పద్యంలో "ర" - మొదటి సగం పద్యంలోను, "న" - రెండవ సగం పద్యంలోను గుణితము కలదు.

(ఇది నాదెళ్ళ పురుషోత్తమకవి "అద్భుతోత్తరరామాయణము"లోనిది)

## ఆదివర్ణావృత్తి

పద్యంలో మొదటిపదానికి వచ్చిన అక్షరమే పద్యంలోని

ప్రతి పదానికిరావడం దీనిలోని చిత్రం.

ఉదాహరణకు ఒక పద్యం "ర"- అనే దానితో ప్రారంభమైన

పద్యంలోని ప్రతిపదం "ర"-తోనే ప్రారంభించబడుతుంది.

గణపవరపు వేంకటకవిగారి

"ప్రబంధరాజ వేంకటేశ్వర విజయవిలాసము" నుండి

ఈ పద్యం చూడండి.

కలకంఠము కరెపులుగును

కలవింకము కంకణంబు కహ్వాము కరుడున్

కలరవము కనకభుక్కును

కళకును కంకమును గాకి కక్కెరకైదన్ (230)

## ఏకసమాస చిత్రం

ఒక పద్యంలోగాని శ్లోకంలోగాని దీర్ఘసమాస అంతాకాని,

ఎక్కువ భాగంగాని కూర్చడం ఏకసమాస చిత్రం అనబడుతున్నది.

ఈ పద్యం చూడండి.

మోచర్ల వెంకన అనే కవి వినుకొండపురమునకు వెళ్ళినపుడు

శ్రీరాజామలరాజు వేంకటనరసింహరాయ ప్రభువును దర్శించగా

ఆ ప్రభువు - ఇతఁడేనా వెంకన - అనెనట అప్పుడు కవి -

అయ్యా! వెంకన ఇతఁడేకాని,-

ఇతఁడేనా? వినుకొండనామకమనోభీష్టార్థకృత్పట్టణ
స్థితసామ్రాజ్యరమాదయామృతఝరీచంచత్కటాక్షేక్షణ
ప్లుతసర్వాంగసమస్తశోభనకళాపుంఖీభవత్ స్తుత్యసం
గతమాల్రాజవరాన్వయప్రభవవేంకట్పార్థివధాత్రీశ్వరుం;
డితఁడేనా - ఇతఁడేనా -

అనెనట ప్రభువుగారు వెంకనకవీంద్రుని అసాధారణాశుధారాపాండిత్యానికి,
ధైర్యానికి సంతోషించి బహుమానమిచ్చి పంపిరట.

ఈ పద్యంలో రంగులో చూపబడినదంతా ఒక సమాసమే కావున ఇది ఏకసమాస చిత్రం.
ఇతఁడేనా? వినుకొండనామకమనోభీష్టార్థకృత్పట్టణ
స్థితసామ్రాజ్యరమాదయామృతఝరీచంచత్కటాక్షేక్షణ
ప్లుతసర్వాంగసమస్తశోభనకళాపుంఖీభవత్ స్తుత్యసం
గతమాల్రాజవరాన్వయప్రభవవేంకట్పార్థివధాత్రీశ్వరుం;
డితఁడేనా - ఇతఁడేనా -

## గతిచిత్రం

ఈ పద్యం చూడండి ఇందులోని చిత్రాన్ని గమనించండి.

జలజ - కనక - కటక - నళిన - భద్రేభ - ముల్
సఖియ కంఠ-కాంతి-జఘన-చరణ-
గమనములకు సాటిగానక తన వృత్తి
ఎదిరి పూర్వరూప పదమునందె

నాయిక కంఠ, కాంతి, జఘన, చరణ, గమనములతో
జలజ, కనక,కటక, నళిన, భద్రేభ - ములు
పోటీ పడినవట అవి ఎంత ప్రయత్నించినా!
వాటికి సాటిరాలేక తలక్రిందులుగా పోరాడి కూడ
పూర్వరూపంలోనే ఉన్నాయట.
కారణం ఏమిటంటే ఆ పదాలన్నీ
అనులోమంగాను ప్రతిలోమంగాను ఒకటే
ఇది ఆమె సౌందర్య పరాకాష్ఠ తెలపటమే.

జలజ, కనక,కటక, నళిన, భద్రేభ - అనే పదాలు
అనులోమంగాను ప్రతిలోమంగాను ఉండటం వల్ల
ఇది గతిచిత్రం.

## పాదభ్రమకం

ఒక పద్యపాదంకాని, శ్లోకపాదంకాని ఎటునుంచి చదివినా
ఒకలాగే ఉంటే దాన్ని "పాదభ్రమకం" అంటారు.

"అలంకారశిరోభూషణే" లోని పాదభ్రమక ఉదాహరణ చూడండి.

లంకాధినాథ గ్రథనాధికాలం
సంసార భూతి శ్రితి భూరసాసం
రంగేవరానన్న నరావగేరం
దేవం భీయా నద్రన యాభి వందే

ఈ శ్లోకం ప్రతిపాదం ముందనుండి చదివినా వెనుకనుండి చదివినా
ఒకటిగానే ఉంటుంది
కాదు............ ఉంది మీరు గమనించి చూడండి.
(రావణుని విజృంభణాన్ని మించి కావయముడైనవాడు, సంసార సంపదా సక్తుడు కానివాడు,
మిక్కిలి సమీపాన కావేరీ నదీ జలాలు ప్రవహిస్తున్న ప్రదేశాన నివాసమున్నవాడు అయిన
శ్రీరంగనాథుని భయభక్తులతో మంచి వాక్కులతో స్తుతించి నమస్కరిస్తాను.)

ప్రతి పాదంలో 11 అక్షరాలు ఉన్నాయి.
మొదటి 5 అక్షరాలను 6 అక్షరం వదలి 7వ అక్షరం నుండి త్రిప్పిరాసిన
పాదభ్రమకం అయినది. అంటే 1,2,3,4,5,6,5,4,3,2,1 ఈ అంకెల్లా కూర్చితే
పాదభ్రమకం అవుతుంది.
పై శ్లోకాన్ని గమనించి చూడండి.

పాదభ్రమకం అక్షరాల నడకలో చిత్రం
కావున దీనికి గతిచిత్రం అని పేరు.

## పాదభ్రమక పద్యం

ఇది "విక్రాల శేషాచార్యు"లవారి "శ్రీవేంకటేశ్వరచిత్రరత్నాకరం" ఉత్తర భాగంలోనిది.

దామోదర రదమోదర
రామా తతరా జయ యజరా తతమారా
రామా జని నిజ మారా
భూమా తతభూమతతమ భూతత మాభూ

ఇది ప్రతి పాదం ఎటునుంచి చదివినా ఒకలాగే ఉంటుంది.

(ర - జంకును, ద - ఖండించువాడా, మోదా - ఆనంద స్వరూపుడా
తత - విస్తృతమైన, రా - బంగారు కలవాడా, తత - అధకమైన,
మా - బుద్ధికి, రా - శాలయైనవాడా, రామా - లక్ష్మి వలన, జని - పుట్టుక కల,
నిజ - నిత్యుడైన, మారా - కాముడు కలవాడా, భూమా - విరాట్ స్వరూపుడా,
తత - పెద్దదియగు, భూ - భూదేవికి, మతతమ - మిక్కిలి ప్రియుడా, భూ - భూమివలె,
తత - గొప్పదియగు, మా - లక్ష్మికి, భూ - స్థానమైనవాడా, దామోదర ,
జయ - జయించుము.)

## ఏకపాది

ఒక పద్యం లేక శ్లోకంలో అన్ని పాదాలు ఒకటిగా ఉంటే దాన్ని ఏకపాది అంటారు.

దీనిలోని పదములు ఆవృత్తి అయిన మహాయమకము ,

చతుర్వ్యవసితయమకము అనికూడ అంటారు.

సమానయాసమానయా

సమానయాసమానయా

స మా న యాసమానయా

సమానయాసమానయా

(కావ్యాదర్శము 3-71)

హే అసమ = ఓ సాటిలేని స్నేహితుడా, స = అట్టి నీవు, మా = నన్ను,

సమాన-యాస-మానయా = సమానమైన ఆయాసముయొక్క

ప్రమాణము కలదియు, సమానయా = మానముతో కూడినదియు,

అసమాన మా = సాటిలేనిదియు అగు, అనయా = ఈ నాయికతో,

సమానయ = కలుపుము. యా = ఏ నాయికతో,

అసమానయా = లక్ష్మీ నయములతో కూడినది కానిది,

న = కాదో, ఆమె లక్ష్మీ - నయములు గల నాయిక అగుటచే

ఉపేక్షింపదగినదికాదు అని భావము.

నాట్యశాస్త్రంలోని ఈ శ్లోకం చూడండి.

వారణానామయమేవకాలో, వారణానామయమేవకాల:

వారణానామయమేవకాలో, వారణానామయమేవకాల:

(ఇది వారణపుష్పములు వికసించుటకు తగిన కాలము.

ఇది ఏనుగులు విజృంభించుటకు తగిన కాలము.

ఇది శత్రువులకు అనుకూలమైన కాలము.

ఇది యుద్ధములకు అనుకూలమైన కాలము.)

## అనులోమప్రతిలోమపాదం

అనులోమము అనగా మొదటినుండి చివరకు,

ప్రతిలోమం అనగా చివరినుండి మొదటికి.

అనులోమప్రతిలోమపాదం అంటే

ఒక పాదం మొదటినుండి చివరకు మళ్ళీ చివరనుండి మొదటికి గల పాదం.

ఒకపాదం మొదటినుండి చివరకు రాసినది ఒకటవ పాదం.

అదేపాదాన్ని చివరనుండి మొదటికి రాసిన అది రెండవ పాదం.

ఇదేవిధంగా మూడవ పాదం తిప్పిరాస్తే అది నాలుగవ పాదం ఏర్పడుతుంది.

ఈ విధంగా కూర్చబడిన శ్లోకం లేదా పద్యం అనులోమ ప్రతిలోమపాదం.

ఇక్కడ అలంకారశిరోభూషణే శబ్దాలంకారంలోని

32వ శ్లోకం ఉదహరించుకుందాం.

రంగవానరతం దేవం
వందేతం రనవాగరం
హారిదాన హితోమేయో
యోమేతోహి నదారిహా

(ఎవరు నిష్కల్మషదాటులకు మేలు చేస్తారో,
పరిమితిలేని ప్రభావం కలవాడో,
నిత్యశత్రువులయిన అరిషడ్వర్గాన్ని నాశనం చేస్తారో,
లక్ష్మిదేవి చేత ఆశ్రయించబడిన వాడో అట్టి
శ్రీరంగక్షేత్ర వాసాసక్తుడైన శ్రీరంగనాథుని ముందుగా
రసాత్మకమైన వాక్కులుగల కవినై
నేను నమస్కరిస్తున్నాను.)

ఈ శ్లోకంలో 1వ పాదం చివరనుండి చదివిన రెండవ పాదం ఏర్పడుచున్నది.
అలాగే 3వ పాదం చివరనుండి చదివిన 4వ పాదం ఏర్పడుచున్నది.
ఈ విధంగా ఏర్పడేదాన్ని అనులోమ ప్రతిలోమపాదం అంటారు.

## ద్విపాది

పద్యమంతా ఒకే పాదం అంటే పద్యం నాలుగు పాదాలు
ఒకే పాదం ఆవృత్తమైన అది ఏకపాది అని తెలుసుకొనియున్నాము.
అలాకాక పద్యంలో రెండుపాదాలు ఆవృతమైన అది ద్విపాది అని పిలుస్తారు.
ఆ రెండు పాదాలు 1,2 ఒకలా, 3,4 పాదాలు మరొలా గాని,
1,3 ఒకలా, 2,4 పాదాలు మరొలా గాని రావచ్చు.
ఇప్పుడు ఈ పద్యం 1,3 సమానంగాను,
2, 4 సమానంగాను ఉన్నది
గమనించండి.

తగిన మగవాని కౌగట తగిలినట్టి
అలిచికుర యౌవనంబది యౌవనంబు!
తగని మగవాని కౌగట తగిలినట్టి
అలిచికుర యౌవనంబది యౌవనంబు!!

ఈ పద్యంలో చిన్న మార్పు తప్ప ఏమిలేదు అనిపిస్తుంది.
1వపాదంలో తగిన - అని 3వ పాదంలో
తగని - అని విరోధాభాసము.
ఇక అర్థంలోకెళితే.....
తగిన మగవాని పొందిన దాని యౌవనమే యౌవనము.
తగని మగవాని పొందిన యౌవనము యౌ - వనము
అంటే వనం(అడవి)పాలు అనికదా!
అరణ్యముతో సమానం.
బాధాకరం - అని భావం.

కాణాదం పెద్దన సోమయాజి 18వ శతాబ్దంలో గద్వాల,

సురపురం సంస్థానాల్లో కవిగా ఉండినవాడు.

ఈయన ఆధ్యాత్మ రామాయణంలోని

ఈ ద్విపాది పద్యం చూడండి.

రాక రాక వచ్చు రామచంద్రుని జూడ

సంతసించి రచటి జనము లెల్ల

రాక రాక వచ్చు రామచంద్రుని జూడ

సంతసించి రచటి జనము లెల్ల

వనవాసం తరువాత రామచంద్రుడు

అయోధ్యకు వచ్చిన సందర్భములో

ఈ పద్యం ఉంది.

రాక - పున్నమి,

రాక రాక వచ్చు - పున్నమ పున్నముకూ వచ్చే,

రామ - అందమైన,

చంద్రుని చూడ - చందమామను చూడగా,

సంతసించునట్లు జనులెల్ల,

రాక రాకవచ్చు - చాలాకాలం రాకుండావుండి వచ్చిన,

రామచంద్రుని చూడ - శ్రీరామచంద్రుణ్ణి చూడగానే,

సంతోషించారు అక్కడి జనమంతా - అని భావం.



Add files

## Comments

Commenting disabled due to a network error. Please reload the page.

You do not have permission to add comments.

చిత్రసాహితి
చిత్రకవిత్వం - గూఢచిత్రం
చమత్కార పద్యాలు
చిత్రకవిత్వ పరిశీలన - అవగాహన
చిత్రకవిత్వం - సంవాదచిత్రం
చిత్రసాహితి - ఆహ్వానం
శ్రీ సాయి శతకము
Sitemap

చిత్రసాహితి >

# చిత్రకవిత్వం - గూఢచిత్రం

## చిత్రకవిత్వం - గూఢచిత్రం

సాహితీమిత్రులారా!

విచిత్రమైన చమత్కార ప్రార్థన.

ఇందులో 8 మంది మామలున్నారు.

చూడండి.

మామను సంహరించి, యొకమామకు గర్వమడంచి, యన్ని శా
మామను రాజుజేసి, యొకమామతనూజునకాత్మబంధువై
మామకుగన్ను లిచ్చి, సుతుమన్మధుపత్నికి దానె మామయై
మామకు మామయైన పరమాత్ముడు మాకు బ్రసన్ను డయ్యెడున్

1. కంసుడనే మామను చంపి,

2. సమగద్రుడనేమామకు గర్వమణచి(రామావతారంలో)

3. చందమామను రాత్రికి రాజును చేసి (నానార్థాలలో రాజు అంటే చమద్రుడు అని ఒక అర్థం)

4. ఒకమామకొడుక్కు(అర్జునునికి) ఆత్మబంధవై,

5. ఒకమామకు కన్ను లిచ్చి(రాయబారంలో ధృతరాష్ట్రునికి)

6. రతీదేవికి తానే మామయై,

7. సముద్రుడు విష్ణువుకు మామ,

8.ఈయనకు గంగను ఇచ్చినందున మామకు మామయైనాడు,

అటువంటి విష్ణువు ప్రసన్నుడై మాకు అనుగ్రహం కలిగించుగాక.

******************************************************************

కొందరు ఆశీర్వదిస్తే మామూలుగా ఉంటుంది.

దాన్ని ఎవరు పట్టించుకోరు.

ఎవరైనా

నమస్కారం అంటే ఇందులో ఆశ్చర్యంలేదు.

మనము నమస్కారం అంటాం.

అంతేనా! మరి అలా కాకుండా దానికిసమానమైన మరోపదం వాడితే

ఆలోచించాల్సివస్తుంది కదా!

అలాంటిదే

ఈ ఆశీర్వాదపద్యం.

మనసిజు మామమామ, యభిమానమడంచినవానిమామ, నం
దను విరోధి నందనుని నందను సుందరి, మేనమామ, జం
పినజెగజెట్టి పట్టి బొడి చేసిన శూరుని తండ్రి గన్నుగన్
గొనిన సురాధినాథుని తనూభవునాయువు మీకు నయ్యెడున్

మన్మథునిమామ చంద్రుడు,
చంద్రునిమామ దక్షుడు,
దక్షుని అభిమానాన్ని అణచినవాని
(శివుని)మామ - హిమవంతుడు,
హిమవంతుని కుమారుడు మైనాకుడు,
మైనాకుని విరోధి ఇంద్రుడు,
ఇంద్రుని కుమారుని కుమారుడు - అభిమన్యుడు,
అభిమన్యుని సుందరి - ఉత్తర,
ఉత్తర మేనమామ - కీచకుడు,
కీచకుని చంపినవాడు - భీముడు,
భీముని కొడుకు ఘటోత్కచుని చంపినవాడు - కర్ణుడు,
కర్ణుని తండ్రి సూర్యుడు,
సూర్యుని కన్నుగా గలవాడు - విష్ణువు,
విష్ణువు కుమారుడు - బ్రహ్మ-
ఆ బ్రహ్మదేవుని ఆయుస్సు
మీకు కలుగుగాక -
---దీని భావం.

&&&&&&&&&&&&&&&&&&&&&&&&&&&&&&&&&&&&&&&&&&&&&

అష్టదిగ్గజాలలో ఒకరైన వారు ఈ పద్యాన్ని కృష్ణదేవరాయల మీద చెప్పారు. అది తెనాలి రామకృష్ణుడని కొందరు భట్టుమూర్తి అని కొందరు చెబుతున్నారు. ఎవరైనా ఆయన ఆస్థానంలోనివారేకదా! ఆ పద్యం

నరసింహ కృష్ణరాయని
కర మరుదగు కీర్తి యొప్పె, కరిభి ద్గిరిభిత్
కరికరిభిద్గిరి గరిభిత్
కరిభిద్గిరిభిత్తురంగ కమనీయంబై !

అర్థం :- కృష్ణరాయని - కరము - అరుదు - అగు = మిక్కిలి ఆశ్చర్యకరమైన, కీర్తి, కరిభిత్ = గజాసురుని సంహరించిన శివుని వలెను, గిరిభిత్ కరి = పర్వతముల రెక్కలను భేదించిన ఇంద్రుని యొక్క ఏనుగు ఐరావతము వలెను, కరిభిత్ - గిరి = ఈశ్వరుని కైలాస పర్వతము వలెను, గిరి - భిత్ = కొండలను భేదించిన - వజ్రాయుధము వలెను, కరిభిత్ - గిరిభిత్ - తురంగ = ఈశ్వరుని - ఇంద్రుని వాహనములైన నందీశ్వర, ఉచ్చైశ్శ్రవముల

వలెను, తెల్లగా, ధగద్ధాగాయమానమై, కమనీయంగా ఒప్పి కనిపించెను.

######################################################################

కృష్ణదేవరాయల ఆస్థానానికి ఒకసారి ఒకకవి వచ్చి అష్టదిగ్గజకవుకు ఒక పరీక్ష పెట్టాడు అదేమంటే మీలో ఎవరు ఏది చెప్పినదాన్ని నేను వెను వెంటనే రాయగలను మరియు మీరు చెప్పిన కవిత్వాన్ని తప్పు పట్టగలను లేదా మీరు నేను చెప్పిన దాన్ని రాయండి, నే చెప్పిన కవిత్వాన్ని తప్పు పట్టండి. వీటికి మీరు సిద్ధమేనా అని ప్రశ్నించాడు. దీనికి అక్కడివారందరూ ఏమీ చెప్పలేని పరిస్థితి ఏర్పడింది. ఆసమయంలో తెనాలి రామకృష్ణకవి ముందుకు వచ్చి నే చెప్పేది రాయమని ఈ క్రింది పద్యం చెప్పాడట.

తృవ్వట! బాబా; తలపై
పువ్వట! జాబిల్లి; వల్వబూదట! చేదే
బువ్వట! చూడగ నుళుళు
క్కవ్వట; అరయఁగ నట్టి హరునకు జేజే!

(తృప్ = సాక్షరపదముల గ్రహింపజాలని పశువు - వృషభం, బాబా = వాహనం, జాబిల్లి, తలపై పువ్వు, వలువ = కట్టుపుట్టము, బూచి = భయంకరమైన (ఏనుగు)తోలు, చేదే = హాలాహలమే, బువ్వ = ఆహారం, ఉళుళుక్ (హుళక్కి)= లేనిది - మాయ, అవ్వ = కాగా, అట్టి హరును = అలాంటి పరమశివునకు, జేజేలు)
రామకృష్ణకవి చెప్పెడి విధానం పద్యం పలికే తీరు అర్ధం కాక ఆ వచ్చిన కవివతంసుడు రాయలేక నిలిచిపోయాడు.

++++++++++++++++===========================++++++++++++++
కొన్ని పద్యాలు క్లిష్టాన్వయాలుగా, నిగూఢార్థాలతో ఉంటాయి
అలాంటి వాటిని గూఢచిత్రంలో చెప్పవచ్చు

అన్వయక్లేశ పద్యాలలో ఇది ఒక పద్యం.
ఈ పద్యం చూడండి.

మానుష దాన మాన బల మానితధర్మ రమా మనోజ్ఞ రే
ఖానుతి భూతి విత్తముల, కాటయవేమనబోలు, వాసవిన్
వానివిరోధి, వానివిభు, వానివిపక్షుని, వానియగ్రజున్
వాని మరంది, వానిసుతు, వానియమిత్రుని, వానిమిత్రునిన్

కాటయవేమన -
మానవత్వంలో అర్జునుని,
దానంలో అర్జునవిరోధియైన కర్ణునుని,
అభిమానంలో కర్ణునుని ప్రభుపైన దుర్యోధనుని,
బలంలో ఆదుర్యోధనుని శత్రువైన భీముని,
మాన్యధర్మంలో ఆ భీముని అన్న యైన ధర్మరాజును,

సంపదలో ధర్మరాజు బావమరిదియైన కృష్ణుని,
మనోహరరూపంలో కృష్ణకుమారుడైన మన్మథుని,
ఐశ్వర్యంలో మన్మథునుని శత్రువైన ఈశ్వరుని,
ధనవిషయంలో ఆ శివుని స్నేహితుడైన కుబేరునితోను
పోలి ఉన్నాడు సుమా!
దీన్ని పెద్దన అనుకరించాడని అర్థమౌతుంది
చూడండి.

శ్రీరుచిరత్వ, భూతి, మతి, జిత్వర, తాకృతి; శక్తి, కాంతులన్
ధీరత, సార, భోగముల, ధీనిధి, యీశ్వర నారసింహు, డా
వారిజనాభ, శంకరుల, వారి కుమారుల, వారి తమ్ములన్,
వారి యనుంగు మామలను, వారి విరోధుల, బోలు నిమ్మహిన్
(మనుచరిత్ర 1-20)

(కృష్ణదేవరాయల తండ్రి నరసింహరాజు
లక్ష్మిని కలిగి ఉండటంతో హరిని,
అణిమాది ఐశ్వర్యములతో శివుని,
బుద్ధిబలంతో బ్రహ్మదేవుని,
జయశీలంతో కుమారస్వామిని,
రూపంతో మన్మథుని,
సామర్థ్యంతో వీరభద్రుని,
ప్రకాశంతో చంద్రుని,
ధైర్యంతో మైనాకుని,
బలంలో రాహువును,
భోగాలతో ఇంద్రుని
యథాప్రకారంగా పోలి ఉన్నాడని భావము.)

---

## పాదగోపనం

పద్యంలో ఒక పాదాన్ని మిగిలిన పాదాలలో గోపనంచేసి చెప్పడాన్ని
పాదగోపనం లేక పాదగూఢం అంటారు.
ఈ గోపనం ఒక క్రమంలో కొందరు కూర్చారు.
క్రమరహితంగా కొందరు కూర్చారు.
ఇది ఇలా ఉంటే ఏపాదాన్ని గోపనం చేస్తారో దాన్ని
ఆ పేరుతో పిలుస్తారు.
మొదటి పాదం గోపనమైతే అది ప్రథమగూఢమని,
రెండవదైతే ద్వితీయ గూఢమని,
మూడవదైతే తృతీయ గూఢమని,
నాల్గవదైతే చతుర్థ గూఢమని పిలుస్తారు.

ఇక్కడ మనం
"అలంకారశిరోభూషణే శబ్దాలంకారప్రకరణం"లోని
26 వ శ్లోకాన్ని తెలుసుకుంటున్నాము.
ఇది ఒక క్రమంలో పాదగూఢం చేయబడిన చతుర్థపాదగూఢం.

పాపం మహిష్ఠం శ్యామాంగ స్థిరతారక్ష్య గమాధునా
శమయస్వాబ్ధి కన్యేశ పాహిమాం రంగనాయక

(నీలదేహా నిరంతరం మొక్కవోని విక్రమం
గల దృఢుడైన గరుడునిపై ప్రయాణించువాడా!
సాగరకన్యకా వల్లభా! రంగనాయకా!
గొప్పదైన ఈ లోకమందలి కలుషాదులను
అణచివేసి నన్ను రక్షించు.)

ఈ శ్లోకంలో 1,3,5,7,9,11,13,15 అక్షరాలను వరుసగా
తీసుకుంటే పాహిమాం రగనాయక - అని వస్తుంది.
అది నాల్గవపాదం. ఇక్కడ మరో విషయం గమనించాలి
రంగనాయకకు బదులుగా రగనాయక అని వచ్చింది.
చిత్రకవిత్వంలో పూర్ణనుస్వార విసర్గలకు
నియమం సడలింపు కలదు.

## సంబోధన గూఢం

వటవృక్షో మహా నత్ర మార్గ మావృత్య తిష్టతి
తావ త్త్వయా న గస్తవ్యం యావత్ నా న్యత్ర గచ్ఛతి

త్రోవకు అడ్డంగా ఇక్కడ మర్రి చెట్టొకటి ఉన్నది.
అది మరొక చోటుకు తొలగిపోయేంతవరకు,
నీవు అచ్చటికి వెళ్ళవద్దు - అని నిషేధం
ఇక్కడ నిషేధం ఎవరికి విధించినట్లు? ఎవరిని సంబోధించినట్లు?
చెట్టు కదలి మరోచోటికి కదలి ఎలా వెళుతుంది?
అందువలన ఇక్కడ సంబోధనను వెదకితే.........
వటవృక్ష: ను "వటో + ఋక్ష:" - గా విడదీస్తే అర్థం సరిగా సరిపోతుంది.
వటో - ఓ బ్రహ్మచారీ! లేక ఓ అబ్బాయీ! ఋక్ష: - ఎలుగుబంటు,
త్రోవకు అడ్డంగా నిలిచి ఉంది. అది తొలగి పోయేవరకు,
అటువైపు వెళ్ళకు - అనేఅర్థం సరిపోతుంది.
ఇందులో సంబోధన దాచబడింది .
కావున ఇది సంబోధన గూఢంగా చెప్పబడుతుంది.

## గ్రహగోపన చిత్రం

ఈ పద్యంలో గ్రహాల పేర్లు ఆంతరంలో ఉన్నాయి కాని పైకి కనిపించవు
కావున దీన్ని గ్రహగోపన చిత్రంగా చెప్పవచ్చు.
ఇది  చాటుపద్యమణిమంజరి 1భా. పుట.86 లోనిది.

సహజ కళంక మూర్తులు కుజాతులు గూఢ తరోదయ ప్రభా
మహితులు గోత్ర విద్విషద మాత్యులు రాత్రి చరానుకూల ధీ
సహితులు మందవర్తనులు సర్పసమానులు రాజసేవక
గ్రహములు కాననయ్యెల రాయని భాస్కరుఁడస్తమించినన్

సహజ కళంకమూర్తి = చంద్రుడు, (పాపపంకిలులు),
కుజాతుడు = అంగారకుడు(కుచ్ఛితంగ జన్మించినవారు, కువర్ణలు),
గూఢతరోదయుడు = బుధుడు(గూఢంగా - రహస్యంగా పుట్టినవారు)
గోత్ర విద్విషదమాత్యుడు = గురువు(కులాన్ని ద్వేషించేవారికి సలహా చెప్పేవాడు),
రాత్రిచరుడు = శుక్రుడు(రాత్రులందు సంచరించే జారుడు, చోరుడు),
మందవర్తనుడు = శని(సోమరి), సర్పసమానులు = రాహుకేతువులు (దుష్టులు)

## సంఖ్యాగోపన చిత్రం

శ్రీరామ రామ రామేతి
రమే రామే మనోరమే
సహస్రనామ తత్తుల్యం
రామనామ వరాననే

ఆధ్యాత్మరామాయణం - పార్వతీపరమేశ్వరసంవాదంలోనిది ఈ శ్లోకం
ఓ మనోరమా వరాననా పార్వతీ నేనెప్పుడూ  రామ -  రామ -  రామ అంటూ ఆనందిస్తాను.
ఆ రామ నామము సహస్రనామాలతో సమానము సుమా!  - అని దీని అర్థం.
రామ రామ రామ అని మూడు మార్లు అంటే అది వెయ్యి మార్లు అన్నదానితో సమానం.
అదెలాగంటే
య,ర,ల,వ - లలో ర అనేది 2వది.
అలాగే ప,ఫ,బ,భ,మ - లలో మ అనేది 5వది.
ఇప్పడు ర అంటే 2, మ అంటే 5. రామ అంటే రా - 2 , మ - 5.
రామ - 2 x 5 = 10 , రామ రామ, రామ అంటే 10 x 10 x 10 = 1000
ఈ విధంగా రామ అనే పదాన్ని మూడు మార్లు ఉచ్ఛరిస్తే వెయ్యి మార్లు అని అర్థం.
ఇది ఇందులోని గూఢార్థం.

పదియు, నైదు, నైదు, పదునైదు, పదునైదు,

ఇరువదైదు, నూట యిరువదైదు,

ఎలమి మూడు నూరు, లిన్నూరు, మున్నూరు,

తలలవాడు మిమ్ము ధన్యు జేయు

ఏమైనా అర్థమవుతుందా?

అన్నీ అంకెలే

అన్ని తలలవాడు మిమ్మలిని ధన్యుల చేస్తాడట.

ఇంతకు ఆయనెవరు?

దీన్నంతా గమనించాలంటే

ఆ తలలు ఎన్నో తేలాలి.

చూద్దాం.

1వ పాదంలోనివి - 10 + 5 + 5 +15 +15 = 50

2వ పాదంలోనివి - 25 + 125 = 150

3వ పాదంలోనివి - 300 + 200 + 300 = 800

మొత్తం = 50 + 150 + 800 = 1000

వేయి తలలవాడు మిమ్ములను ధన్యుల చేస్తాడు.

వేయి తలలున్న ఆయన ఆదిశేషుడు.

ఆ ఆదిశేషుడు మనలను ధన్యుల చేస్తాడు - అని భావం.

<<<<<<<<<<<<<<<<<<<<<<<<<<<=====================>>>>>>>>>>>

ఒక కవిగారు ఒక రాజు వద్దకు వెళ్ళి తన దీనగాథను

ఈ పద్యంలో విన్నించుకున్నాడు. ఆ పద్యం .........

నడవకయె నడచి వచ్చితిన

డచిన నే నడచిరాను నడచెడు నటులన్

నడపింప నడవ నేరను

నడవడికలు చూచి నన్ను నడిపింపరయా

నడవలేక నడచి వచ్చుట ఏమిటి? నడిస్తే కారపోవడం ఏమిటి?

ఇదంతా నడకమీదనే పద్యం సాగింది. ఇంతకు దీని భావం ఏమిటి అంటే...........

సంసారం నడవక (గడవక) యింత దూరము వచ్చాను.

నాస్థితి గమనించి, తగు సహాయము చేసి పంపండి - అని భావం

నక్షత్రము పేరిటి సతి

నక్షత్ర సుఖంబుఁగోరి నక్షత్రేశున్

నక్ష్త్రమునకు రమ్మని

నక్షత్రముఁబట్టి యీడ్చి నగియెఁ బ్రియమునన్

దీనికి 1947 అక్టోబరు నెల భారతిలో శ్రీ గొబ్బూరు వేంకటానందరావుగారు చేసిన వ్యాఖ్య ఇది.

నక్షత్రము పేరుగల సతి - ఉత్తర

నక్షత్రము చేతబట్టి - కుంకుమబరిణిని(భరణి నక్షత్రం) చేతపట్టి,

నక్షత్రముపైన వేసినది అనగా చేతిని(హస్త నక్షత్రం) తన ప్రాణనాథుడైన అభిమన్యునిపై వేసి,

నక్షత్రమును రమ్మని - మూల(నక్షత్రం)కు రమ్మని, పిలిచినది.

అంటే యుద్ధసన్నద్ధుడవుతూ ఉన్న అభిమన్యుని ఉత్తర మూలకు రమ్మని పిలిచినదని భావం

దీన్నే 1948 మార్చినెల భారతి సంచికలో తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారు ఈ విధంగా వ్యాఖ్యానించారు.

దీనిలో కవి తారాశశాంకుల తొలినాటి ప్రణయలీలను హృద్యాతి హృద్యంగా అభివర్ణించారు.

నక్షత్రము - తార

నక్షత్రసుఖము - ఆశ్లేషము (కౌగిలింత) సుఖం,కోరి

నక్షత్రేశున్ - చంద్రుని,

నక్షత్రమునకు రమ్మని - మూలకు రమ్మని,

నక్షత్రముఁబట్టి యీడ్చినది - (హస్త నక్షత్రం) చేయి పట్టి లాగినది.

ఈ విధంగా సాగింది ఈ వ్యాఖ్య. చూశారా గూఢఅర్థం ఎంత గూఢంగా ఉందో.

=============================================================

హంసవింశతి కర్త అయ్యలరాజు నారాయణామాత్యకవి

తనగురించి

ఏవిధంగా చెప్పుకొన్నాడో చూడండి.

ఎవనికీరితి కుభృద్ధవ కుభృద్ధర బుధ
    కరిసైంధవ సమిద్ధహరిణరుచిర
మెవనిమేధంబురుడ్భవ కభుగ్ధవ విధూ
    ద్భవ మరుద్ధవగురుప్రతివిఘాతి
యెవనియీ వహిమరుగ్భవ సరిద్ధవ లస
    ద్భువనభృత్త్రిపురభిద్భూరిమహిమ
యెవనిరూ పమృతభుగ్ధవసుతోద్వేడ్రతీ
    డుడ్వేడ్భృదాప్తపుత్రోల్లసనము
మంత్రిమాత్రుండె యతడు దుర్మంత్రిమంత్ర
తంత్రసంత్రాసకరణస్వతంత్రుఁడయల
రాజవంశసుధావార్ధిరాజ సూర
సూర్యనారాయణామాత్యవర్యుఁడలరు.

(హంసవింశతి పీఠిక-15)

1వపాదము-

ఎవనికీర్తి - కుభృత్ + భవ - హిమవంతునివలెను,

కు - భృత్శేషునివలెను, (మరియు)కైలాసమువలెను, హర - ఈశ్వరునివలెను,

బుధకరి -సైంధవ - ఐరావతము, ఉచ్చైశ్శ్రవములవలెను,

సమిద్ధహరిణ రుచిరము - ప్రకాశమైన ధావళ్యముతో ఒప్పినదో!

2వపాదము -

ఎవనిమేధ - అంబురుద్భవ - బ్రహ్మను,

కభుక్ + ధవ - వాతాశనపతి  అయిన ఆదిశేషుని,

విధు  + ఉద్భవ - బుధునిని, మరుద్ధవ గురు - దేవేంద్రునిగురువగు

బృహస్పతిని - ప్రతిఘటించునదో!

3వపాదము-

ఎవనిత్యాగము - అహిమరుగ్భవ - కర్ణుడు,

సరిత్  + ధవ - సముద్రుడు, అసద్భువన భృత్ - మేఘుడు,

త్రిపురభిత్ - ఈశ్వరుడు, వీరిత్యాగముకంటె గొప్పదియో!

4వపాదము -

ఎవనిరూపు - అమృతభుగ్ధవసుత - జయంతునివలెను,

ఉడ్వీట్ -  చంద్రునివలెను, రతీట్ - మన్మథునివలెను,

ఉడ్వీద్భృదాప్తపుత్ర - నలకూబరునివలెను - ప్రకాశించునదియో!

కీర్తిలోనూ, మేధలోనూ, త్యాగములోనూ, రూపంలోనూ

అటువంటివాడైన మంత్రి మాత్రమేకాదు

చెడు ఆలోచనలకు స్వంతముగా మంత్రము తంత్రములచే రక్షించగల

అయలరాజవంశమునకు చంద్రుని వంటివాడై అలరారెడువాడు

ఈ నారాయణామాత్యకవి

- అని చెప్పుకున్నాడు.

ఎంతటి వాడో ఈ పద్యాన్ని బట్టి తెలుస్తున్నది.

^^^^^^^^^^^^^^^^^^^^^^^^^^^^^^^^^^^^^^^^^^^^^^^^^^^^^^^^^^^^^^^^^^^^

శ్రీ భూతపురి సుబ్రమణ్యశర్మ గారు తన శ్రీకృష్ణభారతము(శ్రీకృష్ణరాయప్రబంధము)

8-429లో ఈ పద్యాన్ని రచించారు.

కోద్భవ కోద్భవ భవభవ

కోద్భవ కోద్భవ భవభవ కోద్భవ భవస

త్కోద్భవ కోద్భవ నుత ది

వ్యాద్భుత పరిపూత చరిత యబ్ధిగభీరా!

ఇది అలంకారాలలో యమకానికి చెందినది.

ఇందులో మొత్తం కోద్భవ అనే పదం 7 మార్లు అవృత్తమైంది.

1.కోద్భవ - నీటినుండి పుట్టినవాడు చంద్రుడు.

2.కోద్భవ భవభవ - నీటినుండి పుట్టినది కమలము, కమలమునుండి పుట్టినవాడు బ్రహ్మ, బ్రహ్మనుండి పుట్టినవాడు శివుడు.

3. కోద్భవ - నీటినుండి పుట్టినవాడు అగ్ని.

4. కోద్భవ భవభవ - కమలము నుండి పుట్టినవాడు బ్రహ్మ. బ్రహ్మనుండి పుట్టినవాడు నారదుడు.

5. కోద్భవ భవ - కమలమునుండి పుట్టినవాడు బ్రహ్మ

6. సత్కోద్భవుఁడు - సత్యస్వరూపుడైన సూర్యునినుండి పుట్టినవాడు సుగ్రీవుడు

7. కోద్భవ - అగ్నినుండి పుట్టినవాడు కుమారస్వామి

చంద్రునిచేతను, రుద్రునిచేతను, అగ్నిచేతను, బ్రహ్మచేతను, సుగ్రీవునిచేతను, కుమారస్వామిచేతను స్తుతి పొందిన అద్భుతచరిత్రగలవాడా శ్రీరామచంద్రా - అని అర్థం.

++++++++++++++++++++++++++++++++++++++++++++++++++++++++++++++

ఈ శ్లోకం చూడండి ఒక స్త్రీ వర్ణన ఎలా చేశాడో.

మధ్యం విష్ణుపదం కుచౌ శివపదం వక్త్రం విధాతు: పదం
ధమ్మిల్ల: సుమన:పదం ప్రవిలసత్కాంచీ నితంబస్థలీ
వాణీ సేన్మధురా2ధరో2రుణధర శ్శీరంగభూమి ర్వపు:
తన్వ్యా: కిం కథయామి భాగ్యసులభైర్మాన్యా సదా నిర్జరై:

ఈకాంతకు నడుము (విష్ణుపదం)ఆకాశం అనగా సన్నటి నడుము కలది.

కుచములు (శివపదం) కైలాసం అనగా ఈమె కుచములు పర్వతాలు.

మొగం (విధాతుపదం) బ్రహ్మనివాసం అంటే ముఖం కమలమే.

కొప్ప (సుమనపదం) దేవతలుండే స్వర్గం అనగా పువ్వులు తురిమే ప్రదేశం.

కటిప్రదేశం (కాంచీపురం) కాంచీపట్టణం అనగా ఒడ్యాణం ధరించి ఉన్నది.

పలుకులనేవి మధురానగరం అనగా మిక్కిలి మధురంగా మాట్లాడునది.

మోవి అరుణాచలం అనగా ఆమె పెదవి చాలా ఎర్రగా ఉన్నదని.

శరీరం శ్రీరంగపట్టణం అనగా చాలా గొప్పవైన శరీరభాగాలు కలదని.

ఇన్ని రకాలుగా నవయౌవన సంపన్నులు అపరిమిత భాగ్యవైభవపరిపూర్ణులు అయిన రసికులు ఎల్లపుడు పొగడదగినదని భావము.

==============+++++++++++===============+++++++++++++=

ఎంచగ చతుర్థ జాతుడు
పంచమ మార్గంబున నేగి ప్రథమ తనూజం
గాంచి తృతీయంబచ్చట
నుంచి ద్వితీయంబు దాటి యొప్పగ వచ్చెన్

ఏమైనా అర్థమైందా? అంతేమరి గూఢచిత్రమంటే

ఇందులోని విషయం ఏమిటంటే

హనుమంతుడు సముద్రాన్ని లంఘించి,

సీతను చూచి, లంకను కాల్చి రావడం

ఇందులోని కథాంశం.

వివరంలోకెళితే

1. పృథివి, 2. జలం, 3. అగ్ని, 4. వాయువు, 5. ఆకాశం - ఇవి పంచ భూతాలు.

ప్రథమ తనూజ - పృథివి (భూమి) పుత్రిక - సీత

ద్వితీయం (జలం)అంటే ఇక్కడ సముద్రం

తృతీయం బచ్చట నుంచి - అగ్నిని అక్కడ ఉంచి

చతుర్థ జాతుడు - వాయువుకు పుట్టినవాడు - హనుమంతుడు

పంచమ మార్గం - ఆకాశమార్గం

ఇప్పుడు భావం తీసుకుంటే -

చతుర్థజాతుడైన హనుమంతుడు,

పంచమ మార్గమైన ఆకాశమార్గంలో వెళ్ళి,

ప్రథమ తనూజ అయిన సీతను చూచి,

తృతీయంబచ్చటనుంచి - లంకకు అగ్గి పెట్టి,

ద్వితీయంబు దాటి - సముద్రాన్ని దాటి

ఒప్పుగ వచ్చెన్ - ఒప్పుగ వచ్చాడు.

~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~

ఒక చిన్న పద్యంలో అష్టదిక్పాలకులను, నవగ్రహములను కూర్చుట

క్లిష్టమైన పని దాన్ని

"కేదారోపాఖ్యానం" అనే కావ్యంలో

"క్రిష్టిపాటి వేంకటసుబ్బకవి" చేసి

చూపాడు చూడండి.

హరి పావక యమ నైఋతి

వరుణానిల ధనద భర్గ - వనజహితాబ్జా

ధరసుత బుధ గురు రవి శని

వర రాహుధ్వజ మదిని - వర్ణింతుఁదగన్

ఇందులో

హరి - ఇంద్రుడు, పావకుడు - అగ్ని, యముడు, నైఋతి,

వరుణుడు(జలాధిపతి), అనిలుడు - వాయువు, ధనదుడు - కుబేరుడు,

భర్గుడు - ఈశానుడు - వీరు అష్టదిక్పాలకులు.

ధరసుతుడు - అంగారకుడు(కుజుడు), బుధుడు, గురువు - బృహస్పతి,

రవి - సూర్యుడు, శని, రాహువు, ధ్వజుడు - కేతువు, శుక్రుడు, చంద్రుడు
~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~

పరిశేషన్యాయంచే చివరి రెండు పేర్లు తీసుకోబడినవి - ఇవి నవగ్రహాలు.

గ్రహరాజు సూర్యుడు కావున నవగ్రహముల క్రమము

ఈ శ్లోకంలోలాగా ఉండాలి.

ఆదిత్యాయ సోమాయ అంగారక బుధాయచ

గురుశుక్రశనిగ్రహాశ్చ రాహవే కేతవే నమ:

ఇది గూఢచిత్రం

"ప్రేమ ఎంత మధురం ప్రియురాలు అంత కఠినం" - అనే పాటను

"ఆచార్య ఆత్రేయ" అభినందన చిత్రంకోసం రాశారు.

అలాగే ఈ పద్యం చూడండి. ఇదేమిటి పాట ముందు చెప్పి

తర్వాత పద్యం అంటాడు అనుకోవద్దు.

ఆ పాటలోని భావానికి ఈ పద్యం కారణం కావచ్చేమో?

ఒక ప్రియుడు తన ప్రియురాలిని గూర్చి

ఈ విధంగా అనుకుంటున్నాడు

ఆ పద్యం.......

కిసలయంబు నీ మేను పొసగ జేసి

సరగ కీదీసి యాయూడ్చి సాగుడిచ్చి

చేసె కాబోలు ధాత నీ చిత్త మరయ

కాక కల్గునే నీ కిట్టి కఠిన బుద్ధి

కిసలయము అంటే చిగురు,

నీ శరీరం చిగురులతో చక్కగా చేశాడు బ్రహ్మ.

కానీ నీ మనసును "కిసలయ" - లోని "కి - య" లను తీసివేసి,

"స"- కు గుడి ఇచ్చి చేశాడు విధాత

అనగా

కిసలయ లో మిగిలినది "సల" దీనిలో "స" కు గుడి ఇస్తే సిల అంటే శిల అని అర్థం.

(ఆమె మనసు శిల కాకపోతే)

నీకు ఇంత కఠిన బుద్ధి కలుగుతుందా! అని ప్రియుడు

బాధతో అనుకొంటున్నాడు - అని భావం.

ఇలాంటిదే మరొక పద్యం

పల్లవము బూని సకియ మేనెల్ల జేసి

పద్మగర్భుడు లా - దీసి వా - గుడిచ్చి

మూ - విసర్జించి యప్పుడ పూవుబోడి

డెంద మొనరించె సందేహమందనేల?

ఒక ప్రియుడు తన ప్రేయసి హృదయం ఎలాంటిదో?

ఈ పద్యంలో వాపోతున్నాడు.

ప్రేమ ఎంత మధురం?

ప్రియురాలు అంత కఠినం -

అనే పాటను మీరు వినే ఉంటారు.

అలాంటిదే ఇదీనూ.............

ఇక భావంలోకి వస్తే...........

ఆ బ్రహ్మదేవుడు ఆమె శరీరాన్ని లేతచిగురుటాకులతో చేశాడు

కాకపోతే అంత మృదువుగా ఉంటుందా! అంత సౌకుమార్యంగా ఎలావస్తుంది?

అంతటితో ఊరుకోక పల్లవము లోని ల - తీసేశాడు అపుడు "పవము" అయింది.

తరువాత వ - కు గుడిచ్చి ము - తీసేశాడు

అపుడు ఆమె హృదయం "పవి" అయింది(పవి = వజ్రాయుధం)

అందుకే ఆమె మనసు అంత కఠినమైంది. ఇక సందేహం ఎందుకు?

- అనుకున్నాడట.

ఇది భావం.

00000000000000000000000+++++++++++++++++++++++++00000000000(

ఈ పద్యభావమేదో గమనింపుడు.

కదళీ స్తంభమునందు నా యుతమై కంజాత మింపొందె, నం
దుదయంబై పవళించెఁ జంద్రుఁ, డచటన్ బ్రోత్ఫుల్లరక్తోత్పలం
బొదవెన్, తత్సుమజాతపై యమున స్వర్ణోర్వీధరంబందు దాఁ
బడి, నూత్నై, గగనంబు గాంచె, నిది యేభావంబొ భావింపుడీ

ఈ పద్యంలోని పదాలకు అర్థాలను ముందుగా చూద్దాం.

కదళీ స్తంభము = తొడ,

నాళము = చేయి,

కంజాతము = అఱచేయి,

చంద్రుడు = ముఖము,

రక్తోత్పలము = ఎఱ్ఱబడిన కన్ను,

యమున = కాటుక తో కూడిన కన్నీటిధార,

స్వర్ణోర్వీధరము = కుచము.

వియోగిని అయిన ఒక కోమలి, తొడపై చేతిని ఆనించుకొని,

ముఖము అఱచేత చేర్చుకొని, కన్నీరు పెట్టినదని,

ఆ కన్నీరు కుచములపై పడి క్రిందికి జాలువారినది

- అని భావం

ఇది గూఢచిత్రం.

# లచ్చి శంకరుండు లలిమీర గలిసిన

ఇదేమిటి లచ్చి శంకరుండు లలిమీర గలిసిన -

ఇదెట్లా సాధ్యం.

ముందు ఈ పద్యం చూడండి.

లక్ష్మి శివుని తోడ లలిమీరగూడిన
భువనకారకుండు పుట్టవలయు
లచ్చి శంకరుండు లలిమీర గలసిన
విష్ణుదేవుడుద్భవింప వలయు

ఇది పైకి అశ్లీలగా, భ్రాంతి కలిగించి, మెదడుకు పదును పెడుతున్నది.

నిదానంగా ఆలోచిస్తే విషయం అర్థమౌతుంది.

లక్ష్మి కి పర్యాయపదాలు చూస్తే - కమల, లచ్చి, రమా, ఇందిర .... ఉన్నాయి.

అలాగే

శంకరునికి పర్యాయపదాలు - భవుడు, ఈశ్వర,ఈశ,....

పై పద్యంలో మొదటి రెండు పాదాలు తీసుకుంటే

లక్ష్మి శివుని తోడ లలిమీరగూడిన
భువనకారకుండు పుట్టవలయు

లక్ష్మి పర్యాయపదం కమల,

శంకర పర్యాయపదం భవుడు,

లక్ష్మి కి శంకరుడు కలిసిన భువనకారకుడు పుట్టాలికదా

పర్యాయపదాలను తీసుకుంటే

కమల(లక్ష్మి) - భవుడు(శంకరుడు) ఈ రెండిటిని కలిపిన కమలభవుడు

అంటే భువనకారకుడు(బ్రహ్మ)కదా!

అలాదే చివరి రెండు పాదములు తీసుకొన్న

లచ్చి శంకరుండు లలిమీర గలసిన
విష్ణుదేవుడుద్భవింప వలయు

లక్ష్మి ని శంకరుడు కలిసిన విష్ణువు పుట్టాలి

పర్యాయపదాలను తీసుకుంటే

రమా(లక్ష్మి) - ఈశ(శంకరుడు) - రమేశ

అంటే విష్ణువేకదా!

మరి ఇందులో అశ్లీలలేదుకదా!

ఇది గూఢచిత్రము

ఈ పద్యం చూడండి.

ఆననాధరగళ మూర్తు లతివ కజు(డు
చంద్రకురువిందశంఖ చంచలల(జేసి,
చెల(గి, తచ్చిహ్న కాఠిన్య సితచలతలు
నొరది( కచకుచహాసదృష్టులుగ( జేసె
(చాటుపద్యమణిమంజరి-1భా. పుట.108)

ఈ పద్యం తెనాలి రామకృష్ణునిదిగా ప్రసిద్ధమయినది.
పద్యంలోని క్రిందిపదాల వరుస చూడండి.
ఆనన-చంద్ర-చిహ్న - కచ
అధర- కురువింద- కాఠన్య- కుచ
గళ- శంఖ- సిత- హాస
మూర్తి-చంచల- చలత-దృష్టులు
ఈ వరుసక్రమంలో పదాలను గుర్తుంచుకొని వివరణలో గమనించండి.

బ్రహ్మదేవుడు వనితయొక్క
ముఖాన్ని(ఆననమును) చంద్రునితోను,
పెదవిని(అధరమును) పద్మరాగ(కురువింద)మణులతోను,
కంఠము(గళము)ను శంఖముతోను,
ఆకారమును(మూర్తిని) మెరుపు(చంచల)తోను,
క్రమంగా ఉంపమింప సృష్టించినాడు.
కానీ,
క్రమంగా వాటిలోని దోషాలను తర్వాత గమనించి,
మరల విజృంభించి(చెలగి)
ముఖము చంద్రునితో చేశాడుకదా చంద్రునిలోని మచ్చ(నలుపు)ను
తొలగించటానికి  ఆమె వెంట్రుకల(కచ)తోను,
పద్మరాగంలోని కఠినత్వాన్ని స్తనాలలోను,
శంఖంలోని తెల్లదనాన్ని(సిత) ఆమె నవ్వు(హాసం)లోను,
మెరుపులోని చంచలత్వాన్ని ఆమె చూపులలోను,
క్రమంగా రూపొందిచి తప్పు చేసినాడనే
అపవాదు నుండి  తప్పించుకున్నాడు బ్రహ్మ.

## Comments

You do not have permission to add comments.

# చిత్రకవిత్వం - సంవాదచిత్రం

## చిత్రకవిత్వం - సంవాదచిత్రం

## సంవాద చిత్రం

సాహితీమిత్రులారా!

రాచనగరులో సంత జరిగేచోట కస్తూరి కుప్పగా పోసి కూర్చొని ఉన్నాడు వ్యాపారి.
అక్కడికి ఒక గొర్రెలకాపరి వచ్చాడు వారి మధ్య జరిగిన సంభాషణ ఈ పద్యంలో
కవి ఏవిధంగా వర్ణించాడో చూడండి. ఉత్పలమాల వృత్తంలో సంభాషణ.

గొర్రెలకాపరి - నల్లని దేంది బేరి? వ్యాపారి - మృగనాభిరా వల్లవ
గొ.- దీన్ని తింటారా? వ్యా. - ఫుల్లసరోజలోచనలు పూతురు చన్నుల
గొ.- బూసినితసే జల్లున చేపునా యెగసితన్న కవూరికె
పాలొసంగునా గుల్లకు యెంతయొత్తనుచు
గొంగడిపర్చిన నవ్విరందఱున్

1735-40 సంవత్సరాల మధ్యకాలంలో మధురపాలకుడైన విజయరంగ
చొక్కనాథనాయకునికి అంకితం
ఈయబడిన అహల్యా సంక్రందనము అనే కావ్యంలోనిది ఈ సంవాద చిత్రం.
దీని కూర్చినవారు సముఖము వేంకటకృష్ణప్పనాయకుడు.

ఈ గ్రంథం ఆంగ్లేయపాకుల కాలంలో నిషేధించబడిన శృంగారకావ్యంగా ముద్రపడిన ప్రత్యేక
కావ్యం.
అహల్య సంక్రందన(ఇంద్రుడు) సంభాషణ చంపకమాల వృత్తంలో ఎంత చిత్రంగా
తీర్చబడినదో చూడండి.

ఇంద్రుడు - ఎవరది యింటిలోపల? అహల్య - అ దెవ్వరు?
ఇం - శక్రుఁడ, అ- చెల్ల! మీరలా! యువలికి రండు,
ఇం- నీదు మగఁడెక్కడ? అ - మూల ఫలార్థ మేఁగె,
ఇం- రా నువిదరో తామసం బగునో? అ- ఉండుఁడు, పూజలు గాంచి పొండు,
ఇం- సేయవలయు పూజ నీ వెఱుఁగవా?
యన - సిగ్గున నేఁగు నవ్వుచున్

అహల్యా సంక్రందనుల సంవాదం ఉత్పలమాలో
(సముఖము వేంకటకృష్ణప్ప నాయకుని అహల్యా సంక్రందనము 3-85)

అహల్య - దేవ శచీ మనోరమణ దేవర వచ్చిదేమి
ఇంద్రుడు - నీదు శోభా విభవంబుఁ జూడ,
అహల్య - వనవాసిని కేమి చెల్వు
ఇంద్రుడు - రత్న మే తావున నున్న నేమి
అహల్య - వనితా నవ మన్మథ నాపయిన్ గృపోద్భవన నానతిచ్చెదవు,
ఇంద్రడు - భవజు నాన, నిజంబు పల్కితిన్

కందపద్యంలో (అహల్యా సంక్రందనము 3-86)
అహల్య - నామగని వేష భాషల నేమిటికి ధరించి వచ్చి తెఱుఁగం జెపుమా
ఇంద్రుడు - నీ మగని రూపు మౌటకు పై మాటలు నడుపవలదె పంకజగంధీ

ప్రేయసి  ప్రియుల మాటలు ఎంత సరసంగా ఉంటాయో చెప్పడానికి ఈ శ్లోకం చూస్తే తెలుస్తుంది. ఇది చాటుధరాచమత్కారసారమనే దానిలోనిది.

శ్లో. కఠిన కుచౌ తవ బాలే, చటుల చకోరాక్షి తావకే నయనే
కుటిల సుకే శ్యలకా స్తే మిథ్యావాదిన్లతాంగి తవ మధ్యమ్

ప్రేయసి - కఠిన! (ఓ కఠినుడా!)
ప్రియుడు - కుచౌ తవ బాలే
(ఓ బాలికాతిలకమా నీకుచములు కఠినముగాని నేనుగాదు)
ప్రేయసి - చపల! (ఓ చపలస్వభావం కలవాడా!)
ప్రి - చకోరాక్షి తావకే నయనే
(ఓ చకోరమువంటి కన్నులు గలదానా! నీకన్నులే చపలములు నేనుగాదు.)
ప్రే.- కుటిల! (వంకర నడతగలవాడా!)
ప్రి.- సుకే శ్యలకా స్తే
(మంచి వెంట్రుకలుగలదానా! నీముంగురులే కుటిలములు నేనుగాదు)
ప్రే.- మిథ్యావాదిన్! (కల్లరీ!, మిథ్యను పలికేవాడా!)
ప్రి. - లతాంగి తవ మధ్యమ్
(తీగెవలె సన్ననిశరీరంగలదానా! నీ నడుమే మిథ్య(కల్ల) నేను కాదు)
*****************************************************************

## కాళిదాసు - భోజరాజు

కాళిదాసు చేపలు తింటున్నట్లు భోజరాజుతో కవులు చెప్పినారు.
ఒకరోజు అంగవస్త్రంలో చేపలు చుట్టుకొని కాళిదాసు వెళుతున్నాడు

అది గమనించిన కవులు కాళిదాసును భోజమహారాజు రమ్మన్నారని చెప్పి కాళిదాసుని పట్టుకొని రాజు దగ్గరకు వెళ్ళారు.

కక్షే కిం తవ? పుస్తకం! కి ముదకం? కావ్యార్థసారోదకమ్!
గంధంకిం? ఘన రామ రావణ మహాసంగ్రామ రంగోద్భవమ్!
పుచ్ఛ:కిం? ఘన తాళపత్ర లిఖితం! కిం పుస్తకం హే కవే ?
రాజన్! భూసుర దేవతైశ్చ పఠితం రామాయణం పుస్తకమ్!

భోజరాజు - కక్షే కిం తవ? (నీ చంకన ఉన్నది ఏమిటి?)
కాళిదాసు - పుస్తకం! (పుస్తకము!)
భో - కి ముదకం? (ఉదకమేమి?)
కా.- కావ్యార్థసారోదకమ్! (కావ్యార్థసారము!)
భో.- గంధంకిం? (వాసనేమిటి?)
కా.- ఘన రామ రావణ మహాసంగ్రామ రంగోద్భవమ్!
(రామరావణ యుద్ధంలో ఏర్పడినది!)
భో.- పుచ్ఛ: కిం? (తోకయేమి?)
కా.- ఘన తాళపత్ర లిఖితం!
(పొడపైన తాటిఆకులపై రాసిన గ్రంథం!)
భో.- కిం పుస్తకం హే కవే? (ఓ కవీ అది ఏ పుస్తకం?)
కా.- రాజన్! భూసుర దేవతైశ్చ పఠితం రామాయణం పుస్తకమ్!
(రాజా దేవబ్రాహ్మణులు పఠించే రామాయణపుస్తకం!)
అంటూ కాళిదాసు భోజుని చేతికి ఆ చేపల మూటను అందిచాడు.

(కాళిదాసు మహిమచే అది తెరచి చూడగా అది రామాయణగ్రంథమే అయింది)

భోజ కాళిదాసుల కథలు అనేకం ఉన్నాయి.
వాటిలో ఇదొకటి. ఇది సంవాద చిత్రం
చూడండి.
ఏ కారణం వల్లో ఒకప్పుడు భోజరాజు కాళిదాసును "భ్రష్టుడా!" అని తిట్టి రాజ్య బహిష్కృతుణ్ణి చేశాడట. కాని త్వరోలోనే పశ్చాత్తాపం చెంది మారువేషంలో కాళిదాసును వెదుక్కుంటూ బయలుదేరాడు. ఒక సత్రం ముందు నీళ్లుకారుతున్న మాంసాన్ని చంకన పెట్టుకొని ఒక సన్యాసి ఆయనకు కనబడ్డాడు.
అప్పుడు వారిమధ్య జరిగిన సంభాషణ శ్లోకం ఇది.

"భిక్షో! మాంస నిషేణం కి ముచితం ?" "కిం తేవ మద్యం వినా?
"మద్యం చాపి తవ ప్రియం? "ప్రియ మహో వారాంగనాభి స్సహ"
"వారస్త్రీ రతయో కుత స్తవ ధనం ?" "ద్యూతేన చౌర్యేణ వా"
"చౌర్య ద్యూత పరిశ్రమో2పి భవతాం?" "భ్రష్టస్య కా వా గతి:"

పై శ్లోకం సంభాషణ ఈవిధంగా సాగింది(తెలుగులో)

భోజ.- నువ్వు చూడబోతే పరివ్రాజకుడివి. మాంసాహారం నీకు తగునా?

సన్న్యాసి- పక్కన మద్యం కూడా ఉంటేనే దీని మజా!

భోజ. - ఏమిటి మద్యపానం అలవాటు కూడా ఉందా నీకు?

సన్న్యాసి - ఒంటరిగా మద్యం తాగడంలో హుషారేముంది వారాంగనలతో కలిసి తాగాలి!

భోజ. - వారాంగనల దగ్గరకి వెళ్ళడానికి డబ్బెక్కడిది నీకు?

సన్న్యాసి- జూదం ఆడి కాని, కన్నం వేసి కాని సంపాదిస్తాను..

భోజ.- చౌర్యానికీ జూదానికీ కూడా దిగజారా వన్న మాట?

సన్న్యాసి - భ్రష్టుడైనవాడు మరేం చేస్తాడు?

########################################################################

## కొంగ హంసల సంభాషణ

హంసలాంటిపండితుడు, కొంగలాంటి పామరుడు వారి తారతమ్యం కవి

ఈ కొంగ హంసల సంభాషణలో చిత్రించాడు.

కొంగ - ఎవ్వడ వీవు కాళ్ళు మొగమెఱ్ఱన?

హంస - హంసము

కొ.- ఎందునుందువో?

హ.- దవ్వుల మానసంబునను

కొ.- దాన విశేషములేమి చెప్పుమా?

హ.- మవ్వపు కాంచనాబ్జములు, మౌక్తికముల్ కలవందు

కొ.- నత్తలో?

హ.- అవ్వి యెఱుంగమన్న

నహహా........ యని నవ్వె బకంబులన్నియున్

## మార్జాల దాంపత్యం

మనం గమనిస్తూనే ఉంటాం రకరకాల వ్యక్తులను, రకరకాల భార్యాభర్తలను.

వారిలో ప్రతిదానికీ కీచులాడుకొనేవారూ కనబడుతూ ఉంటారు.

వారి దాంపత్యాన్ని మార్జలదాంపత్యం అంటూ ఉంటారు.

అలాంటి ఒక దంపతుల సంభాషణ

ఈ శ్లోకంలో కవి చూపాడు చూడండి.

ఆ: పాకం నకరోషి పాపిని కథం? పాపీ త్వదీయ: పితా!

రండే జల్పసి కిం ముధా కలహిని? రండా త్వదీయ స్వసా!

నిర్గచ్ఛస్వ హటాన్మదీయ భవనాత్! నైదం త్వదీయం గృహం!

హా! విశ్వేశ్వర దేహిమేద్య మరణం! శప్పం మదీయం గతమ్!

భర్త - పాపాత్మురాలా! వంట చెయ్యలేదా?

భార్య - నీ తండ్రి పాపాత్ముడు!

భ.- రండా! ఏమి ప్రేలుచున్నావు?

భా.- నీ చెల్లెలు రండ.

భ. - నా యింటినుండి వెంటనే పొమ్ము!

భా. - ఇది నీ యిల్లు కాదు!

భ. - హా పరమేశ్వరా నాకు మరణము నిమ్ము!

భా.- నా వెంట్రుక పోయినదనుకొందును.

----------------------------------------------------------------------------------------------

కావ్యాలంకారం సంగ్రహం వివరణములో ఉదాహృతమైన స్మరణాలంకార ఉదాహరణ.

ఇది సంవాద చిత్రంలో ఉంది గమనించండి.

సౌమిత్రే !నను సేవ్యతాం తరుతలం చండంశు రుజ్జృంభతే

చండంశో ర్నిశి కా కథా? రఘుపతే! చంద్రో2యమున్మీలతి

వత్సైత ద్విదితం కథంనుభవతా? ధత్తే కురంగం యత:

క్వాసి ప్రేయసి! హా కురంగ నయనే! చంద్రాననే! జానకీ!

శ్రీరాముడు- లక్ష్మణా! ఎండ కాయుచున్నది చెట్టునీడకు పద

లక్ష్మణుడు- శ్రీరామా రాత్రి సూర్యు డెక్కడ?

చంద్రుడు వెన్నెల కాయుచున్నాడు.

రాముడు- నీకు చంద్రుడని ఎట్లు తెలిసింది?

లక్ష్మణుడు- అందు కురంగమున్నది.

రాముడు- హా! కురంగనయనా! సీతా! ఎటనుంటివి.

అని సీతాస్మరణము కలిగినది.

---------------------------------------------------------------------------------------------

పూర్వకాలంలో చిన్నపిల్లలకే పెళ్ళిళ్ళు చేసేవారుకదా!

అలాంటి బాలవధువు(12,13 సం.లోపు పిల్ల) పురుషాసక్తత అసలే లేని పిల్ల

తన తల్లితో ఇలా చెబుతున్నది.

మాత! శ్వశ్రుగృహం నయామి శయితుం, కస్మచ్ఛ చంద్రాననే?

జామాతా అతినిర్దయో భుజలతాపాశేన మాం పీడతే

వక్షోజగ్రహణం కరోతి సతతం ఓష్ఠం దశత్యాదరాత్

నీవీబంధ విమోచనంచ కురుతే నిద్రాం నలేభే నిశి

బాలిక - అమ్మా! నేను అత్తవారింటికి శయనానికి వెళ్ళను.

అమ్మ - చంద్రముఖీ! కారణమేమి?

బాలిక - నీ అల్లుడు దయారహితుడు!

నన్ను గట్టిగా కౌగిలించుకొంటున్నాడు.
ఉరోజములను ఎప్పుడూ పట్టుకొంటున్నాడు.
పెదవి కొరుకుతున్నాడు.
చివరకు చీరముడికూడా విప్పేస్తున్నాడు.
రాత్రంతా నిద్రలేకుండా చేస్తున్నాడు!

## అత్తవారి ఇల్లు ఎలాంటిది?

అత్తవారి ఇల్లు ఎలాంటిది? - అనేది ఒక ఊహాజనిత ప్రశ్న
దానికి సమాధానంగా
ఈ శ్లోకం
దాని కథ తెలుసుకుందాం.

శ్వశుర గృహనివాస: స్వర్గతుల్యో నరాణాం
యది భవతి దరిద్రో పంచ వా షడ్దినాని
దధి మధు ఘృత లోభాత్ మాసమేకం వసేత్ చేత్
తదుపరి దిన మేకం పాదరక్షా ప్రయోగ:

ఒక మామగారి ఇంటికి ఒకేసారి మనుగడుపు
(వివాహానంతరం అత్తవారింట్లో చేసే విందు,
దీన్నే కొన్ని ప్రాంతాల్లో అల్లెం తినటానికి అంటారు)ల
కోసం విచ్చేశారట. ఎంత ధనం, ఓపిక, ప్రేమగలవారైనా,
ఎంత బాగా పెట్టాలనుకున్నా, ఎంతకాలమని,
అల్లుళ్ళకు తినుబండారాలు, సేవలు చేయగలరు
వారికే మాత్రం విసుగు పుట్టకుండా ఉంటుందా!
ఇలా ప్రతి దినం, పీకలదాకా మెక్కి పరిహాసాలాడుకుంటున్న
అల్లుళ్ళలో ఒకరి బుద్ధివచ్చి అత్తవారిల్లు అన్ని విధాలా స్వర్గసుఖాలలో
ఓలలాడిస్తుంది అనే అర్థం వచ్చే పైశ్లోకంలోని
మొదటిపాదం
(శ్వశుర గృహనివాస: స్వర్గతుల్యో నరాణాం),
అత్తవారింటి గోడపై రాసి వెళ్ళిపోయాడు.
మరి కొన్ని రోజులకు రెండవవాని బుద్ధివచ్చి,
అత్తవారిల్లు ఎంత స్వర్గసీమ అయినా, 5,6 రోజులకంటే మించి ఉండటం
మంచిదికాదు(యది భవతి దరిద్రో పంచ వా షడ్దినాని) అని
రెండవ పాదం గోడమీద రాసి ఉడాయించాడు.
మరికొన్ని రోజులకు మూడవ అల్లుడు అజీర్ణవ్యాధి తెచ్చుకొని
ఎవో అత్త వారింట అనాయాసంగా గడ్డ పెరుగు, పాలు, పిండి వంటలు
వడ్డిస్తున్నారుకదా! అనే అర్థం వచ్చే
(దధి మధు ఘృత లోభాత్ మాసమేకం వసేత్ చేత్)

మూడవ పాదాన్ని అసంపూర్ణంగానే రాసి ఫలాయనం మంత్ర పఠించాడు.
ఇక నాలుగవ వాడు మాత్రం తిని త్రేపి వారిమీద పెత్తనం కూడా చేస్తూ,
ఇవికావాలి, అవికావాలి అని అధికారం చెలాయించడంతో,
పాపం బావమరుదులైనా ఏంచేస్తారు? ఎంత కాలం అని భరిస్తారు?
ఏమి చేసేదిలేక ఆగ్రహోదగ్రులై చెప్పుతో సెత్తిని బొచ్చు ఊడేదాకా
నాలుగు దెబ్బలు కొట్టారు. దానితో ఆ నాలుగవ వాడుపారిపోతూ,
ఆదరాబాదరగా
తిండి మీద ఆశతో సెలల కొద్ది తిష్ఠవేస్తే, ఆ తర్వాత చెప్పుదెబ్బలు తప్పవు
(తదుపరి దిన మేకం పాదరక్షా ప్రయోగ:) అనే అర్థం
వచ్చే నాల్గవ పాదాన్ని రాసి పారిపోయాడు.

అసలు విషం ఏంటంటే ఏంత ఆశపోతులైనా,
అత్తవారింట్లో ఎక్కువ రోజులు ఉండరాదు
- అనేది భావం.

--------------------------------------------------------------------------------------------
==============================================================

ఒకరితో ఒకరు మాట్లాడటమే సంవాదం కాదు.
మనలో మనమే ప్రశ్నించుకొని సమాధానాలు
చెప్పుకుంటూంటాము అవి కూడా సంవాదాలే.
ఒకడు తనలో తాను ప్రశ్నించుకొని,
ప్రతి వచనం చెప్పుకుంటాడు.
దానికి ఉదాహరణ ఈ శ్లోకం చూడండి.

హాలాహలో నైవ విషం విషం రమా
జనా: పరం వ్యత్యయ మత్ర మన్వతే
నిపీయ జాగర్తి సుఖేన తం శివ:
స్పృశన్ని మాం ముహ్యతి నిద్రయా హరి:

పూర్వం దేవదానవులు పాసముద్రాన్ని తరచినపుడు పుట్టిన
ఈ హాలాహలం అనే విషం సంగతి తెలియక ప్రజలు దాన్ని
ఘోరకాకోల విషం అన్నారు.
వాస్తవానికి అది పూర్తిగా అబద్ధం.
అసలైన విషం ఏందంటే - అది లక్ష్మి(సంపద)
ఎందుచేతంటారా?
ఆలోచించిచూస్తే నిజంగా
దాన్ని మస్తుగా(పూర్తిగా) తాగిన శివుడు,
ఏ ఇబ్బంది,
చావు లేకుండా హాయిగా, సుఖంగా మేల్కనే ఉన్నాడు.
కాని,

సముద్రంలో పుట్టిన అసలు విషం అయిన
లక్ష్మిని(సంపదను) తాకినంత మాత్రాన్నే
తన్మయత్వం చెందిన విష్ణువు మాత్రం మూర్ఛితుడైనట్లు
నిద్రాముద్రుడై ఉన్నాడుసుమా!
కనుక అసలు విషమంటే లక్ష్మి(సంపద)యే అని భావం.
మధ్యలో వచ్చిన సంపదతో అతడు మతమత్తచిత్తుడై,
కళ్ళుమూసుకుపోయినాడని గూఢార్థం.
++++++++++++++++++++++++++++++++++++++++++++++++++++++++++++++++

## లక్ష్మీ - పార్వతుల సంవాదం

శ్లో. భిక్షార్థీ స క్వయాత:? సుతను బలిమఖం! తాండవం క్వాద్య భద్రే?
మన్యే బృందావనాంతే! క్వను స మృగశిశు:? నైవజానే వరాహమ్!
బాలే! కచ్చిన్న దృష్టో జరఠ మృగపతి:? గోపయేవాత్ర వేత్తా!
లీలా సంలాప ఇత్థం జలనిధి హిమవత్కన్యయో: త్రాయతాం న:!

లక్ష్మీ - బిచ్చగాడు ఎక్కడకు వెళ్ళాడు?

పార్వతి - బలియజ్ఞమునకు!

లక్ష్మీ - ఈనాడు తాండవం ఎక్కడ?

పార్వతి - బృందావనంలో అనుకొందును!

లక్ష్మీ - ఆ జింకపిల్ల ఎక్కడ?

పార్వతి- ఏమో ఆ వరాహమును నేనెరుగను!

లక్ష్మీ - బాలా ముదుసలి ఎద్దు కన్పించలేదా?

పార్వతి- గోవులను కాయువానికే తెలియును!
ఈ విధంగా సాగిన లక్ష్మీ - పార్వతుల సంవాదం మిమ్ము రక్షించుగాక!

మరొక సంవాద చిత్రం

ఈ క్రింది శ్లోకం వాయువుకు మామిడి కొమ్మకు మధ్య జరిగిన సంభాషణ.

శ్లో. చిరశ్రాంతో దూరాత్ అహముపగతో హన్త మలయాత్
తదేకం త్వద్గేహే తరుణి పరిణేష్యామి దివసమ్
సమీరేణోక్త్యేవం నవకుసుమితా చూతలతికా

ధునానా మూర్ధానం నహి - నహి - నహీ త్యేవ వదతి

మండు వేసవిలో వాయువు మామిడి కొమ్మతో - "నేను మలయ పర్వతం నుండి అలసి వచ్చాను. నీ దగ్గర ఒక్కనాడు గడుపదలచాను" - అని అన్నాడు.

దానికి కొత్తగా పుష్పవతి అయిన ఆ మామిడి కొమ్మ "వద్దు! వద్దు! వద్దు!" - అని మూడుసార్లు అన్నది. (దీని భావమేమంటే మూడు రోజులు ఆగు అని.)

## Comments

You do not have permission to add comments.